విస్మయం
అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక

సంపాదకవర్గం
: సంపాదకుడు:
లయన్.కె.వి.గోవిందరావు
బి.ఏ., ఎల్.ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు:
కొండముది దత్తాత్రేయశర్మ
వి.బాలకుమార్ ఎం.ఏ., బి.ఎడ్.,

సభ్యులు:
కె.వి.ఎస్.శరత్‌బాబు బి.ఏ., బి.కాం., బి.ఎల్.,
కె.వి.ఎస్.విజయకుమార్ బి.కాం.,
కె.రత్నకుమారి

:చందావివరాలు:
3 సంవత్సరాల చందా రూ 140/-
సంవత్సర చందా రూ. 48/-
ఎయిర్ మెయిల్ (1సం॥) రూ 200/-
సీ మెయిల్ (1సం॥) రూ. 100/-

చందా పంపవలసిన చిరునామా
రత్నా ఏజన్సీస్
9, దేశికా రోడ్, ఆళ్వారుపేట వద్ద
మద్రాసు - 600 004
ఫోను : 4990327

మే 1994

ఈ సంచికలో



-: ముఖచిత్రం: కలర్‌ట్రాన్స్‌పరెన్సీ:-
విక్కీ హోండా

ధ్యానం

## మంచివాడే గొప్పవాడు


జేమ్స్ ఎలెన్

గొప్ప వ్యక్తి ఎప్పుడూ మంచివాడై ఉంటాడు, ఎప్పుడూ సామాన్యంగానే కనిపిస్తాడు. అంతర్గతమైన - ఖాళీ కాని - పవిత్ర నీటిధారలో జీవిస్తాడు.

గొప్పతనాన్ని కోరేవాడు మంచిగా ఉండటం నేర్చుకోవాల్సి ఉంటుంది. అందువల్ల అతడు ఘనతను ఆపాదించుకోకుండానే గొప్పవాడు అవుతాడు. గొప్పతనం లక్ష్యంగా పెట్టుకున్న మనిషి ఎక్కడికీ చేరలేడు. ఏమీలేని దాన్ని లక్ష్యంగా పెట్టుకుంటేనే అతడు గొప్పతనం పొందుతాడు. గొప్పవాడు కావాలనే కోరికే వ్యక్తిగత అహంకారపు అల్పత్వానికి గుర్తు. రెప్పపాటు లేని దృష్టి నుంచి అదృశ్యమయ్యేందుకు సుముఖత్వం, స్వార్థపరత్వం లేకపోవటం - గొప్పతనానికి సాక్ష్యాలు. అల్పత్వం అధికారాన్ని అపేక్షిస్తుంది, ప్రేమిస్తుంది. గొప్పతనం ఎన్నడూ అధికార దర్పం ప్రకటించదు. ఈ విధంగా అది తర్వాతి తరాలు ఆరాధించే ప్రమాణంగా రూపొందుతుంది.

సంపాదకుని పే

## ఆనందానికి సురక్షిత మార్గాలు

ఆనందం అనేది - ఒక మానసిక స్థి దీన్ని పొందాలంటే నీవు కొన్ని అలవాట్లు, వైఖరులు, విలువలు, అలవర్చుకోవాలి. మానవుని సుఖసంతోషాలకు, జీవన లక్షణాలకు అనేక కారణాలు దోహదం చేస్తాయి.

మనిషికి అధికమైన ఆనందాన్ని అందించే గుణం ప్రేమకు ఉన్నది. ప్రేమించటమంటే మన సుఖాన్నీ, ఆనందాన్నీ మన చుట్టూ ఉన్నవారికి కూడా విస్తరింపజేయటమే. ప్రేమతో మాత్రమే మనం మానవతావాదులుగా మారుతాము, భూమి స్వర్గం అవుతుంది. ప్రేమలేని జీవితం అసౌఖ్యానికి దారి తీస్తుంది.

చింతవీడండి. చింతను జయించేందుకు ఒక ఉత్తమమార్గం: వర్తమానంలో జీవిస్తూ పని చేసుకుపోవటం, గతాన్ని మర్చిపోయి, భవిష్యత్తును ఉపేక్షించటం.

ఆరోగ్యంలోనే ఆనందం ఇమిడి ఉన్నది. అనారోగ్యవంతుని బ్రతుకు - అతనికి మిగిలినవన్నీ ఉన్నప్పటికీ - నికృష్టమైనది.

జీవితంలో సుఖం పొందాలనుకుంటే నీవు కాలం యొక్క ప్రాధాన్యాన్ని గుర్తించాలి. ఒకసారి గతించిపోయినకాలం ఎన్నటికీ తిరిగి రాదు. యోగ్యమైన ప్రతిదానికోసం నీవు సమయం వినియోగించాలి. దాన్ని అత్యధికంగా ఉపయోగపర్చుకోవాలి. అలాకానిపక్షంలో జీవితంలో ఉత్తమమైన, విలువైనదేదీ నీవు సాధించలేవు.

ఓర్పు - అత్యంత ఘనమైనది, ఉదాత్తమైన శక్తి కలది. నీవు ఓర్పు లక్షణాన్ని మరియు

"అధికారంతో సాధించలేనివెన్నో అభిమానంతో సాధించవచ్చు." — రోజ్‌పాల్

మానసిక సమదృష్టిని అలవర్చుకున్నట్లయితే నీ జీవితం అత్యంత ఆనందదాయకంగా మారుతుంది. ఓర్పుతో పనిచేయటం, ఓర్పుతో వేచి ఉండటం - వీటి ఫలితాలే, అనేక మహత్కార్య సాధనలు.



ఆనందానికి, జీవిత సుఖానుభవానికి, సునిశిత మైన చమత్కార దృష్టి కూడా అవసరమే. జీవితంలో ఎత్తు పల్లాలను తట్టుకుని నిలబడే శక్తిని - ఈ లక్షణం - ఇచ్చి తోడ్పడుతుంది. దురదృష్టాలను తేలికగా తీసుకునే స్వభావాన్ని కల్గిస్తుంది.

నీవు అన్యాయమైన విమర్శల్ని లెక్క చేయవద్దు. ఇంతవరకు జీవించిన వ్యక్తుల్లో లింకన్ అత్యంత తీవ్ర విమర్శకులోనైన వ్యక్తి. కానీ ఆయన పేరు తరతరాల పర్యంతం - కనీవినీ ఎరుగనంతగా - అమెరికా చరిత్రలోనే అత్యంత గొప్ప అధ్యక్షుని పేరుగా ప్రకాశిస్తున్నది.

నీకు సుఖంలో తృప్తి కూడా ఉండి తీరాలి. తృప్తి లేకపోతే కోరికలను తగ్గించుకోవటం సాధ్యపడదు. కోరికల్ని తగ్గించుకోని పక్షంలో సుఖం ఉండదు. సుఖాల వెంటపడే బుద్ధిని అదుపు చేసేందుకు నీవు ఆత్మనిగ్రహాన్ని అభివృద్ధి చేసుకోవాలి. అదుపులో ఉన్న బుద్ధి, మానసిక శాంతికి దారి తీస్తుంది. మానసిక శాంతి సంతోషానికి త్రోవ చూపుతుంది.

మర్యాద - మానవుని సౌఖ్యానికి దోహదం చేస్తుంది. సంఘంలో - అతని నిత్య జీవితంలో - ఆరాధించబడుతుంది. నీ సామాజిక సంబంధాలలో, సాంఘిక కలయికలలో - చిన్న కనికరపు పనులు, స్వల్ప మర్యాదలు, అల్ప అనుతాపాలు ఆచరిస్తే - అవి నీ సంతోష సౌఖ్యాలకు ఎంతో తోడ్పడతాయి.

గ్రంథపఠనం పట్ల యదార్థమైన ఆసక్తిని పెంపొందించుకున్న వ్యక్తి ఎంతో సుఖంగా ఉంటాడు. కడపటగా, మనశ్శాంతినీ సంతోషాన్నీ కలిగించే గ్రంథాలు - జీవితపు విలువల్ని సంపాదించి పెట్టే ఉత్తమ సాధనాలు. నిర్మానుష్యమైన గదివలెనే శూన్యమైన మనస్సు కూడా నీచమైన ఆలోచనలు ప్రవేశించేందుకు తెరువబడి ఉంటుంది.

మీ విరామ సమయాలను వినియోగించేందుకు హాబీ (ఇష్టమైన పని (లేక) సరదా) - ఒక ఆహ్లాదకరమైన వృత్తి. తోట పని, ఛాయాచిత్ర గ్రహణం (ఫొటోగ్రఫీ), తపాలా బిళ్ళల సేకరణ, నాణాల సేకరణ - నీవు సాధన చేయదగిన హాబీలలో కొన్ని. ఇవి నీకు సంతోషకరమైన వాతావరణాన్ని సృష్టిస్తాయి.

మంచి స్నేహితులతో సాహచర్యం కూడా నీకు సంతోషం కలిగిస్తుంది. మిత్రులు మన దుఃఖాలను తగ్గించి, మన ఆనందాన్ని ద్విగుణీకృతం చేస్తారు. జీవితంలో ఏర్పడే దురదృష్టాలకు తట్టుకుని నిలబడే శక్తిని మనకు కలుగజేస్తారు.

ఒక సౌఖ్యదాయకమైన జీవితాన్ని గడిపేందుకు - దేవుని పట్ల విశ్వాసం - ఒక ప్రధాన సహకారిగా ఉంటుంది. ప్రార్థన - జీవితంలోని ఒత్తిడులను, వ్యాకులాలను నిషేధిస్తుంది. ప్రార్థన యొక్క శక్తి ద్వారానే మహాత్మాగాంధీ ప్రభావితులయ్యారు.

"తమ పూర్వీకుల ఘనతనే చెప్పుకునేవారు, తమకిక తాము ఏమీ సాధించలేరు."
—మెకాలె

# భారత యోగులు

## ఆదిశంకరాచార్యులు

అన్ని కాలాలలోనూ, అత్యున్నత దార్శనికుడు, తత్త్వవేత్త అయిన ఆదిశంకరాచార్యులు 788 ఏ.డి.లో కేరళలోని కాలడిలో జన్మించినట్లు తెలుస్తున్నది. శంకరుని జీవిత గ్రంథంలోని ప్రతి పుటలో అతని ఆధ్యాత్మిక జ్ఞానం, తార్కిక చతురత మరియు దార్శనిక గంభీరత ప్రస్ఫుట మౌతుంది.



బాలునిగా శంకరుడు వేదపాఠశాలకు హాజరయ్యాడు. అతడు ప్రపంచాన్ని ఎందుకు విసర్జించాడంటే అతని మేథ ప్రపంచం యొక్క దుష్టత్వానికి అపవిత్రం అవుతుందేమో ననే భావంతో సన్యాసాశ్రమ స్వీకారం కోసం త్వరపడసాగాడు. ఆ తరువాత తన జీవితా న్నంతా భగవంతుని తెలుసుకొనటం కోసం అర్పించాడు. అంతేగాక భారత సమాజం తన నిర్మాలిన్యపు స్వచ్ఛతతో తిరిగి పరిఢ విల్లేందుకు కూడా కృషి చేశాడు.

ఆమె తుది ఘడియల్లో చెంతకు చేరుతానని తల్లికి అభయమిచ్చి శంకరుడు సన్యాసాశ్రమపు మర్మాలు తనకు వివరించి చెప్పి, సర్వోన్నతమైన సత్యానికి మార్గం చూపే అధ్యాపకుని వెదకుతూ వెళ్ళాడు. నర్మదానది ఒడ్డున గల ఓంకార నాథ్‌లో శంకరుడు గోవింద భగవత్పాదునిలో తన గురువును దర్శించాడు. సర్వోత్కృష్టమైన సత్యానికి సంబంధించిన ప్రతి దశను అన్వేషిస్తూ అతడు ఆ గురువు చెంత నిల్చిపోయాడు. వినమ్రుడై, సక్రమమార్గంలో న్యాయనిర్ణయం చేసుకుంటూ, జ్ఞాన సముపార్జన చేశాడు.

అన్ని బోధలకు, ద్వంద్వ (ద్వివిధ) వైఖరులకు సమావేశ స్థలిగా అద్వైత వేదాంతాన్ని స్థాపించాలనే తన గురువు ఆదేశం నెర వేర్చేందుకు శంకరుడు వేదమతానికీ, సంస్కృతికీ పురాతన పీఠమైన వారణాసికి వెళ్ళాడు. భిన్నత్వంలో ఏకత్వానికి సంబంధించిన దైవ సందేశాన్ని వ్యాపింప చేసేందుకు పూనుకున్నాడు. వివిధ భావాలు గల అనేక విభిన్న తరగతులకు చెందిన మహా పండితులతో తర్కవాదనలు జరిపాడు. తన ఆలోచనా విధానంలోని సర్వాధికారాన్ని నిలబెట్టాడు. వారణాసిలో - అతని నలుగురు అనుచరులలో ఒకడైన సనందనుడు (తర్వాత పద్మపాదుడని పేరు పొందాడు) అతనితో చేరటం జరిగింది.

ఈ ఆధ్యాత్మిక మహాపురుషుడు తన శిష్యులతో కలసి వారణాసి నుండి బదరీనాథ్‌కు తన వేదాంత సందేశాన్ని వ్యాప్తి చేస్తూ పయనించాడు. అతడు ప్రయాగ, హరిద్వార్, హృషీకేశ్, శ్రీనగర్, రుద్రప్రయాగ, నంద ప్రయాగ, కామరూప మరియు గోముఖి వంటి పవిత్ర క్షేత్రాలను సందర్శించాడు. మార్గ మధ్యంలో కనిపించిన

"మెరిసేదంతా బంగారమని భ్రమపడకు." —సెర్వాంటిస్

దేవతామూర్తులను పూజించాడు. హిమాలయ శిఖరాల నిశ్శబ్ద వాతావరణంలో శంకరుడు హైందవుల మూడు సిద్ధాంతాలైన - పది ఉపనిషత్తులకు, భగవద్గీత మరియు బ్రహ్మ సూత్రాలకు వ్యాఖ్యానాలు రచించాడు. తన సిద్ధాంతాన్ని గట్టి పునాదులపై నిల్పాడు.

వివిధ మత విశ్వాసాలు గలవారితో, ఇతర తెగల నాయకులతో చర్చలు స్వయంగా జరుపుతూ శంకరుడు ఒక చోటి నుంచి మరోచోటికి ప్రయాణించాడు. తన మహనీయమైన వాదనా నైపుణితో అంధవిశ్వాసాలను, పిడివాదాలను సరిదిద్దుతూ వచ్చాడు. ఐతిహ్యం ప్రకారం తన పర్యటనలలో శంకరుడు మండనమిశ్రుని కలుసుకున్నాడు. ఆత్మజ్ఞానం మరియు సన్యాసాశ్రమ ఆదర్శం వంటి విధానాలకు వ్యతిరేకమైన వైదికకర్మ విధానానికి ప్రధాన మద్దతుదారుడై మీమాంసా పద్ధతిలో యోధుడుగా పరిగణింపబడుతున్న మండనమిశ్రుని కలుసుకున్నాడు. శంకరుడు మండనునితో వాదన జరిపాడు. ఆ వాదనలో మండనమిశ్రుడు ఓడిపోయాడు. ఓటమి తర్వాత అతడు సురేశ్వరాచార్యుని పేర శంకరునికి శిష్యునిగా మారాడు.

శంకరుడు భారతదేశమంతా నాలుగుసార్లు పర్యటించాడు. ఇండియాలోని నాలుగు ప్రధానమైన మఠాలను నెలకొల్పాడు. దక్షిణాదిలో శృంగేరీ పర్వతాలపై శృంగేరీ మఠం, పడమటి దిక్కున ద్వారకలో శారదా మఠం, ఉత్తరాదిలో బదరికాశ్రమంలో జ్యోతిర్మఠం, తూర్పున పూరీలో గోవర్ధన మఠం స్థాపించాడు. తమ అధికారానికి లోబడిన ప్రాంతంలో నివసించే సామాన్య ప్రజలలోనూ, సన్యాసులలోనూ నైతిక ప్రవర్తనను పెంపొందించేందుకు వీలుగా అతడు తన నలుగురు ప్రధాన శిష్యులను ఈ మఠాధిపతులుగా నియమించాడు. ప్రతి మఠానికి ఒక వేదాన్ని ప్రత్యేకించాడు. ఈ విధంగా ఋగ్వేదం గోవర్ధన మఠానికి, యజుర్వేదం శృంగేరీ మఠానికి, సామవేదం శారదా మఠానికి, అథర్వణవేదం జ్యోతిర్మఠానికి ప్రత్యేకించబడ్డాయి.

శంకరుడు దేవాలయాలలో వేదోక్త పూజలలోని ఉదార సిద్ధాంతాలను ప్రవేశపెట్టటం ద్వారా దేవాలయాలలోని అవినీతి విధానాలను సంస్కరించాడు. ఆత్మ సాక్షాత్కార పద్ధతిలోకి వారిని మార్చివేశాడు. ఐదు దైవాలు - గణపతి, శివుడు, నారాయణుడు, సూర్యుడు మరియు శక్తి - పూజలను సంస్కరించి, పూర్వస్థితిలోకి తెచ్చాడు. వేదాంత తత్త్వశాస్త్రంలో విగ్రహ పూజకు కూడా స్థానం ఉన్నదని ఋజువు చేశాడు.

హిమాలయ పర్వతశ్రేణిలోని కేదారనాథ్‌లో తమ 32వ ఏట శంకరాచార్యులు పరమ పదించారని ఐతిహ్యం చెబుతున్నది.

## ఓదార్పు మాటలు



*కాలం కఠినంగా ఉండి, నీవు బాధలు పడుతున్నప్పుడు*
*ఇతరుల గురించి, వారి కలతల గురించి కూడా ఆలోచించు*
*కేవలం నీవిపత్తులు అనేకంగా ఉన్నంత మాత్రాన -*
*ఇతరుల కేమీ లేవని మాత్రం అనుకోవద్దు.*

"అందరికీ కళ్ళు ఉన్నాయి. కాని, లోతుకి చూడగల శక్తి కొందరికే ఉంటుంది."
—మెకవెల్లీ

# సక్రమ ఆరోగ్యానికి సరైన ఆహారం

ఆరోగ్యానికి సంకేతాలు - ఆరోగ్యకరమైన చర్మం, చక్కని ముఖకాంతి, ప్రకాశించే ఒత్తైన జుట్టు, సొగసైన విగ్రహం.

హిప్పొక్రట్స్ అనుచరులు రూపొందించిన ఆరోగ్యనియమాలలోని ఒక ఆదేశం ప్రకారం,



మనిషికి ముగ్గురు వైద్యులు ఉండితీరాలి - సంతుష్టమైన స్వభావం, ప్రశాంత నిర్మలత్వం మరియు మిత ఆహారం. నాలుగోది కూడా నీవు కలుపుకోవచ్చు - స్వచ్ఛమైన గాలిలో స్నానం చేయడం. ఊపిరి పీల్చటం, వ్యాయామం చేయటం, భుజించటం - స్వచ్ఛమైన తాజా గాలిలో చేయాలి. కిటికీలు తెరచి నిద్రించాలి. రెండుగంటలపాటు మూతవేసిన గదిలోని గాలి అప్పటికే హానికరమైనది.

ద్రవరూపంలోని అలంకరణ కంటే సక్రమమైన పోషకాహారం ద్వారా ఆరోగ్యవంతమైన రంగును సంపాదించుకోవచ్చు. చర్మం తనంతటతానే ఆదర్శవంతమైన చర్మపు సారాన్ని ఉత్పత్తి చేసుకుంటుంది - అయితే అలా అది తయారు చేసుకునేందుకు మనం తోడ్పడాలి. శాక సంబంధమైన (కూరగాయల) నూనె ప్రతిరోజూ ఒకటి నుంచి రెండు టీ స్పూన్ల మేరకు వినియోగించటం అవసరం. ఏ శాక సంబంధ నూనె అయినా - అది ధాన్యపు నూనె కానీ, ఆలివ్ నూనె కానీ, సన్‌ఫ్లవర్ నూనె వగైరా కానీ - విటమిన్ 'ఏ, డి' మరియు చర్మానికి అవసరమైన 'నియాసిన్'లతో కూడి ఉంటుంది.

సౌందర్యానికి పునాదులుగా విటమిన్లను - సరిగానే - భావించటం జరుగుతున్నది. వీటిల్లో విటమిన్ ఏ ప్రథమస్థానం అలంకరిస్తుంది. అది కళ్ళకూ, కేశాలకూ ఒక తళుకునూ,

## విస్డమ్ పాత కాపీలు

*మే '84, జూన్ '84, ఆగస్టు '84 నుంచీ నవంబరు '84, మార్చి '85 నుంచీ జూన్ '85; ఫిబ్రవరి '86 నుంచీ ఏప్రిల్ '86, సెప్టెంబరు '86 నుంచీ డిసెంబరు '86, జనవరి '87, మార్చి '87 నుంచీ మే '87, ఆగస్టు '87, డిసెంబరు '87; జనవరి '88, మార్చి '88 నుంచీ డిసెంబరు '88, జనవరి '89 నుంచీ డిసెంబరు '89, జనవరి '90 నుంచీ సెప్టెంబరు '90, నవంబరు '90, డిసెంబరు '90; ఫిబ్రవరి '91 నుంచీ డిసెంబరు 91, జనవరి '92 నుంచీ డిసెంబరు '92, జనవరి '93 నుంచీ సెప్టెంబరు '93 కాపీలు మా వద్ద ఉన్నవి 1984 కాపీల వెల రూ. 7.50లు, 1985 కాపీల వెల రూ. 5 50లు; 1986 కాపీల వెల రూ 10 50లు, 1987 కాపీల వెల రూ. 10 00లు, 1988 కాపీల వెల రూ. 18.75లు; 1989 కాపీల వెల రూ 24 50, 1990 కాపీల వెల రూ. 25 50, 1991 కాపీల వెల రూ. 26.50, 1992 కాపీల వెల రూ. 33 00; 1993 కాపీల వెల రూ 25 00లు రిజిస్టర్డ్ పోస్ట్‌లో పొందటానికి కాపీల వెలతో పాటు రూ. 6.00లు ఛార్చి M O. పంపాలి. 'రత్నా ఏజెన్సీస్', 9, దేశికా రోడ్డు, (ఆళ్వారుపేట వద్ద), మద్రాసు - 600 004.*

—సర్క్యులేషన్ మేనేజర్

"చాలామందికి వాదించటం చేతనవును సంభాషించడం చేతకాదు."

—ఆల్కాట్

మెఱుపునూ ఇస్తుంది. అంగక్రమ నిర్మాణంలో అది లేకపోయినట్లయితే, జుట్టు మరియు వ్రేలి గోళ్ళు మెరుపు, కాంతి లేకుండా, పెళుసుగా పెరుగుతాయి. చర్మం కూడా ఒక అనారోగ్యకరమైన బూడిదరంగు ఛాయలో ఉంటుంది. దీన్ని అరికట్టేందుకు - పాల పదార్థాలు మరియు ముడి గ్రుడ్లులోని పచ్చని భాగం, కారట్స్ మరియు టొమాటోలు, lettuce (ఒక విధమైన కూరాకు మొక్కలు) మరియు ఆకుపచ్చ బఠాణీలు - క్రమబద్ధంగా తీసుకునే భోజనంలో చేర్చబడాలి.

ప్రొటీన్ల కొరత - చర్మం అకాల వార్ధక్యం పొందేందుకు దారి తీస్తుంది. అది వ్యాకోచ గుణాన్ని కోల్పోతుంది. పొడిగా ఉండి, ముడతలు పడిపోతుంది. అనీమియా (పాండురోగం) వృద్ధి పొందుతుంది. చెంపలు (బుగ్గలు) మరియు పెదవులు వెలవెలబోతూ, వివర్ణంగా ఉంటాయి. పాలు, జున్ను, పొటాటోలు, తృణ ధాన్యాలు మరియు గోధుమ రొట్టె - ఈపరిస్థితిని అధిగమించేందుకు తోడ్పడతాయి.

మీప్రాతఃకాల అల్పాహారంలో కాఫీ లేదా స్ట్రాంగ్ టీకి బదులు పాలు తీసుకోవాలి. మీ ఉదయపు భోజనంలో ఒక తాజాపండు లేదా కూరగాయల పచ్చడి లేదా పండ్లరసం చేర్చు కోవాలి. ఉదాహరణకు: రెండు ఆపిల్ పండ్లు, నిమ్మరసం, ఒక టీ చెంచా తేనె లేక కారట్స్, మీగడ - మీకు మంచివి.

ఎక్కువ ద్రవ పదార్థాలను, పాలరసాలు, ఓషధులతో కూడిన ద్రవాలు, నీళ్ళు మరియు తేనెలను ఎక్కువగా త్రాగండి. ఇవి వ్యర్థ పదార్థాలను పోద్రోలేందుకు తోడ్పడతాయి. ముడి బీటు దుంపల రసం అత్యంత ఉపయో గకరమైన విరేచన ఔషధం.

రాత్రివేళల్లో అధికంగా తినవద్దు. ఉత్తమ భోజనం - ఒకగ్లాసు టొమాటో రసం. ఒక జున్ను ముక్క లేదా కూరగాయలు ఈ భోజనానికి అనుబంధంగా ఉంటాయి.

తీపి వస్తువులను తరచుగా భోజనాల మధ్య తీసుకోవటం జరుగుతుంది. ఒక సక్రమమైన భోజనం స్థానే దీన్ని తీసుకోవటం మరింత చెడ్డపని. క్రొవ్వు పెరగటం ద్వారా దీనికి మూల్యం చెల్లించాలి. ఆహారంలో పూర్తిగా చక్కెరను తొలగించటం కూడా పొరబాటే. అది అవశ్యకమే కానీ పరిమిత మోతాదుల్లో తీసుకోవాలి. ప్రతిదినం 70 నుండి 80 గ్రాములకు మించి తీసుకోకూడదు చక్కెరకు బదులు తేనె, జామ్, ఎండు ద్రాక్షలు మరియు ఇతర ఎండిన పండ్లు తీసుకోవటం మంచిది.

శరీర సౌష్టవాన్ని కాపాడుకునేందుకు కొందరు మహిళలు కొన్ని నెలలపాటు, ఒక్కోసారి కొన్ని సంవత్సరాలపాటు - తినటం మానివేస్తారు. ఇది చాలా హానికరమైనది. నీకు నీవై పస్తు లుండటం కూడా అవసరం లేని పనే. ఒక నెలలో బరువు తగ్గటం ఒకటి లేదా రెండు కిలోగ్రాముల కంటే మించకూడదు.

— "చాట్స్ ఆన్ న్యూట్రిషన్" సౌజన్యంతో

## వ్యతిరేక భావం

*ఒక వ్యక్తి మినహా మిగిలిన మానవాళి యావత్తూ ఏకాభిప్రాయంతో ఉన్నట్లయితే - ఒకే ఒక వ్యక్తి విరుద్ధాభిప్రాయాన్ని వెలిబుచ్చినట్లయితే - అతని నోటిని మూసివేయటం జరిగితే అప్పుడు మానవాళి ప్రవర్తన న్యాయబద్ధం కాజాలదు. అతనికి అధికారం ఉండి మానవాళికి నిశ్శబ్దం చేయగలిగినప్పుడు అది న్యాయమని ఋజువవు తుంది.*

— జాన్ స్టూవర్ట్ మిల్

"బుద్ధిమంతులు తర్కిస్తారు; మూర్ఖులు నిశ్చయిస్తారు."

# మందహాసపు ఇంద్రజాలం

సి. మార్టిన్

జనరల్ మేనేజర్, ఎల్ఐసి హౌసింగ్ ఫైనాన్స్
లిమిటెడ్, బొంబాయి

దీర్ఘమో, హ్రస్వమో - మందహాసం (చిరునవ్వు) ఒక అద్భుతమైన విషయం. విద్యుచ్ఛక్తి లేదా సూదంటురాయి ఆకర్షణశక్తి వలె కనిపించని ఒక అసాధారణమైన శక్తిని మందహాసం ఉత్పత్తి చేస్తుంది.ఇది మానవ మనస్తత్వాన్ని ప్రభావితం చేసే గొప్పశక్తి కలిగి ఉంటుంది ఒక మానవ జీవికీ, ఒక జంతువుకూ తేడా ఏమిటంటే మానవప్రాణి నవ్వుతుంది, దరహాసం చేస్తుంది, కానీ జంతువు ఇవేవీ చెయ్యలేదు.



ఎన్నో విషయాలను సక్రమంగా మార్చే మలుపు వంటిది - చిరునవ్వు - అని చెబుతారు. కోపదృష్టికి ఎన్నో కండరాలు ఉపయోగించవలసి వస్తుంది. కానీ ఒక చిరునవ్వుకు అతి తక్కువ కండరాల చలనం చాలు. కనుక నీ చుట్టుప్రక్కల సూర్యకాంతిని ప్రసరింపచేసేందుకు నీవు చిరునవ్వులు చిందిస్తే కోపతాపాలకు, కండరాల చలనాలకు, అవసరం ఉండదు!

కొంతకాలం క్రితం నేనొక పోస్టర్ (గోడల కంటించిన కాగితం) చూడటం తటస్థించింది. దానిపైన "చిరునవ్వు చిందించండి! అది మీ ముఖ విలువను పెంచుతుంది" అని వ్రాసి ఉన్నది. అయితే దీనికంటే ఎక్కువే లాభం ఉన్నది. దరహాసం మీ ముఖ మూల్యాన్ని పెంచటమేకాక, మీరు ప్రసరించిన చిరునవ్వును అందుకున్న ఎదుటి వ్యక్తి మనోభావాలను అభివృద్ధి చేస్తుంది కూడా. కనుక చిరునవ్వు రెండు విధాల మేలు చేస్తుంది. అది అందించే వ్యక్తికీ మేలు చేస్తుంది. 'కరుణ' వలే ఒక సహజగుణంగా స్వీకరించే వ్యక్తికీ మేలు చేస్తుంది.

మనం ఒక ఛాయాచిత్రానికి భంగిమ ఇచ్చే టప్పుడు - మనల్ని చిరునవ్వులు చిందించమని చెబుతారు. "రెడీ! చిరునవ్వు నవ్వండి" అంటాడు ఫొటోగ్రాఫర్. మన పెదవులు విచ్చుకున్ని నెమ్మదిగా వెడల్పు సాగుతాయి. కళ్ళు మెరుస్తూ కాంతితో ప్రకాశిస్తాయి. ముఖం మరింత ఆకర్ష

## నీవే ఆడుకో, డాడీ!

*ఐదుగురు బిడ్డల తండ్రి ఒక ఆటవస్తువు తీసుకుని ఇంటికి వచ్చాడు. పిల్లల్ని పిల్చి దాన్ని వారిలో ఎవరికి ఇవ్వమంటారని అడిగాడు. "అత్యంత విధేయత గలవాడు, తల్లితో పితూరీలు చెప్పనివాడు, చెప్పిన పని చేసేవాడు ఎవరు?" అని ప్రశ్నించాడు. అక్కడ నిశ్శబ్దం ఆవరించింది. వాళ్ళంతా ముక్తకంఠంతో ఇలా అరిచారు: "డాడీ! దానితో నీవే ఆడుకో!"*

"చెప్పదగ్గ అంశం లేనప్పుడే, పరుషవాక్కులు వెలువడుతాయి."

—విక్టర్ హ్యూగో

జీయంగా, మరింత సంతోషదాయకంగా, బహుశా మరింత సుందరంగా కనిపిస్తుంది. అది ఎన్నో సంగతులు చెబుతున్నట్లుంటుంది — "నేను సుఖంగా ఉన్నాను, నేను శాంతిగా ఉన్నాను, నేను తృప్తిగా ఉన్నాను." అది ఈ విధంగా చెబుతున్నదేమో అని కూడా అని పిస్తుంది: "మీరు ఎలా ఉన్నారు? మిమ్మల్ని కలుసుకోవటం నాకు సంతోషంగా ఉన్నది" అని చెబుతున్నట్లు అనిపిస్తుంది కూడా.

"రామాయణం" టీవీ సీరియల్‌లో అరుణ్ గోవిల్ .తన ప్రేక్షకుల్ని చిరునవ్వులతో అలరించి, ఆకర్షించాడు. లియో నార్డో డా విన్సి చిత్రించిన ప్రపంచ ప్రసిద్ధి చెందిన గొప్ప వర్ణ చిత్రాలలో ఒకటి - మొనాలిసా - భ్రమ కలిగించే ఆమె చిరునవ్వు. ఈ వర్ణ చిత్రం అమూల్యమైనది. ఎందుకంటే మొనాలిసా చిరునవ్వు సూచించేదేమిటో ఎవరూ ఖచ్చితంగా చెప్పలేకపోవటమే!

ఎప్పుడైనా నీకు అసాధ్య పరిస్థితి ఏర్పడి నట్లయితే చిరునవ్వు చిందించు. ఆ హాని నుండి, ఆ ఇబ్బందుల నుండి బయటపడటం జరుగుతుంది. నీవు డ్రైవింగ్ చేస్తూ, ఇతర మోటారిస్టులకు ఉపద్రవం కల్గించినట్లయితే నీవు ఒక పెద్ద దరహాసం ప్రదర్శించు. అది వారిని నిరాయుధుల్ని చేస్తుంది. అది ఇతరులను కూడా చిరునవ్వులు నవ్వేటట్లు చేస్తుంది. ఇక ప్రపంచం విభిన్నంగా కనిపిస్తుంది. చిరునవ్వు - ఏ ఖాతాదారునికైనా - ఎంత తృప్తి చెందని వాడికైనా - సంతోషం కల్గిస్తుంది. కొందరు వ్యక్తులు తమ పనిని చక్కగా నిర్వహిస్తారు కానీ వారి ముఖాలపై చిరునవ్వు కనిపించదు. దీనివల్ల అదనపు ఖర్చు ఏమీలేనందువల్ల వీరు తమ ముఖాలను చిరునవ్వులతో అలంకరించి నట్లయితే వారు చేసిన సేవలు రెండు రెట్లు సంతృప్తి కలుగజేస్తాయి. చిరునవ్వులతో అందించే మంచి సేవకు అర్థం- ఈ సేవ ఇష్టపడి చేస్తున్నది- అనీ (లేదా) - "ఇది మీకోసం చేయటంలో నేను సంతోషం పొందుతున్నాను" అనీ భావించాలి.

## ప్రార్థన - మన హృదయ ద్వారాలు తెరిచే సాధనం



*భగవంతుడు మనలోకి ప్రవేశించేందుకు, స్వార్థం (స్వలాభం) వెలికి పోయేందుకు, ప్రేమ లోనికి ప్రవేశించేందుకు, ద్వేషం బయటికి పోయేందుకు విశ్వాసం లోనికి ప్రవేశించి, భయం వెలికి పోయేందుకు, అణకువ (వినయం) లోనికి ప్రవేశించి, అహంకారం వెలికి పోయేందుకు -* ప్రార్థన - మన హృదయ ద్వారాలను తెరుస్తుంది.

## పథకం లేని వ్యక్తి

*ప్రణాళికా బద్ధం కాని ప్రయత్నం విజయం సాధించటం చాలా స్వల్పం. ఒక పథకం లేని వ్యక్తి - ప్రవాహంలో కొట్టుకు పోయేవాడే - అంతకంటే వేరేమీకాదు. సంఘటనలు ఎలా తటస్థిస్తే అలా తన జీవిత మార్గం నడుపుకునేందుకు వేచి ఉండే వ్యక్తి అతడు.*

— ది రాయల్ బ్యాంక్ ఆఫ్ కెనడా మంత్లీ లెటర్

"అబ్బాయికి ఎప్పుడు నోరుమూసుకోవాలో నేర్పితే, చక్కగా మాట్లాడటం దానంతటదే అలవాటవుతుంది."

# [illegible] పిల్లలు కోరే హక్కులు

తల్లిదండ్రులపట్ల అనురాగం, వారిని అర్థం చేసుకునేందుకు బుద్ధిసూక్ష్మత కల మార్గదర్శకత్వం కావాలని కోరే హక్కు.
అతడు లేదా ఆమెకు కావలసినంత ఆహారం, దుస్తులు, ఆశ్రయం అందించే ఒక యోగ్యమైన గృహంలో పెంచబడే హక్కు.



ధర్మ పరాయణతగల మార్గ దర్శకత్వం, శిక్షణ కావాలని కోరుకునే హక్కు.
ఆదర్శవంతమైన విద్యా విషయిక శిక్షణకు అనుబంధంగా పాఠశాల కార్యక్రమం - వ్యక్తిగత అభివృద్ధికి అత్యధిక అవకాశం. జీవితానికి సన్నాహం సమకూర్చేదాన్ని - కోరుకునే హక్కు.
ఉత్తమ నడవడిక, శీలం మరియు అలవాట్ల సక్రమాభివృద్ధికి దోహదం చేసే నిర్మాణాత్మకమైన క్రమశిక్షణను పొందకోరే హక్కు.
అభివృద్ధికి నష్టం కలిగించే, అన్నిరకాల ప్రభావాలకు వ్యతిరేకంగా అతని (లేక) ఆమె ఉన్న సమాజం భద్రత కలిగి ఉండే హక్కు.
స్వేచ్ఛాయుతమైన, సంపూర్ణమైన వినోద కాలక్షేపంలో వ్యక్తిగతమైన ఎంపిక కోరే హక్కు.

8. తమ బిడ్డల సంక్షేమమే తమకు ప్రాథమికమైన ప్రాధాన్యత అనే నమ్మకాన్ని ఆచరించే పెద్దలు గల సంఘంలో నివసించే హక్కు. ఉత్తమ వయోజనుని దృష్టాంతంగా పొందే హక్కు.

— న్యూయార్క్ యూత్ కమిషన్

## ఆనందం కల్గించే విశేషాధికారం

*పొగడ్తకు అర్హుడైన ఒక వ్యక్తిని స్తుతించటంలో మనం తప్పిపోయినప్పుడు రెండు విషాద సంఘటనలు తటస్థిస్తాయి. మన ప్రోత్సాహం కోరుతూ సక్రమ మార్గంలో నడిచే అవకాశం అతనికి కలిగించకపోవటం బహూకృతికి అర్హమైన, శ్రమకుతగిన ప్రతిఫలం అందించే అత్యంత సంతోషదాయకమైన ప్రత్యేకాధికారాన్ని మనం కోల్పోవటం*

*— జాన్ రస్కిన్*

## అతి చిన్న పోలింగ్ కేంద్రం

*గ్రేట్ నికోబార్ దీవుల్లోని (బంగాళాఖాతం) కాంప్‌బెల్‌కు సమీపంలో గల పులోబెట్ గ్రామంలో - గత లోక్‌సభ ఎన్నికల సమయంలో - దేశంలో కెల్లా అతి చిన్న పోలింగ్ కేంద్రం పెట్టారు - ఇక్కడి ఓటర్ల జాబితాలో 10 మంది ఓటర్లే ఉన్నారు*

## ఆక్సిజన్ లేకుండా ఎవరెస్ట్ ఎక్కిన ఏకైక వ్యక్తి

*ఇటలీకి చెందిన రెయిన్‌హోల్డ్ మెస్నర్ 1980 ఆగస్ట్‌లో ఆక్సిజన్ లేకుండా ఒంటరిగా మౌంట్ ఎవరెస్ట్ అధిరోహించిన మొదటి వ్యక్తిగా పేరొందాడు.*

"వాదనలో పసలేనపుడు - దానిని నిలబెట్టుకోవడానికి చిందులు తొక్కు తుంటారు."
—మాంటేగ్

# వార్తలు

## తపాలా వార్షిక పరిమాణం

120 మిలియన్‌కు పైగా గృహాలలో నివసిస్తున్న ప్రతి పురుషుడు, స్త్రీ, శిశువుకు వార్షిక తపాలా పరిమాణం 16 లేఖలుగా ఉన్నది.

## పసుపు పంటలో ఆంధ్రప్రదేశ్ ముందంజ



ఇండియాలో పసుపు పంట విస్తృతంగా పండే రాష్ట్రాలు: ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, ఒరిస్సా మరియు మహారాష్ట్ర. దేశంలో అత్యధిక పసుపు ఉత్పత్తి చేసే రాష్ట్రం - ఆంధ్రప్రదేశ్. ఇండియాలోనే అత్యధిక దేశీయ (అంతర్గత) వినియోగం జరుగుతున్నది - 90 శాతం.

## ప్రపంచంలోని అతి సాధారణ వ్యాధి

ప్రపంచంలోని అతిసాధారణ వ్యాధి - దంతక్షయం. తమ జీవితకాలంలో కొద్దిమంది మాత్రమే దీని ప్రభావం నుండి బయట పడగలుగుతారు. ప్రపంచంలోని కొన్ని ప్రాంతాలలో దంతాలలో చేరే (కుట్టే) క్రిమి ఉపద్రవం 100 శాతానికి చేరుకుంది.

## ఇండియాలో మూర్ఛవ్యాధి

ఇండియాలో మూర్ఛ (అపస్మారం) వ్యాధి ఇప్పుడు 1 శాతం వంతున ఉన్నది. వ్యాధి గ్రస్తులలో 75 శాతం మంది 18 సంవత్సరాల లోపు వయస్సు గలవారే.

## ప్రపంచ నిరక్షరాస్యుల సంఖ్య

ప్రపంచ నిరక్షరాస్యుల జనాభాలో 15 సంవత్సరాల పైబడిన వయస్సు గలవారు దాదాపు 890 మిలియన్ ఉన్నారు. 2000 సంవత్సరం నాటికి ఇది 900 మిలియన్ సంఖ్యకు చేరుతుంది.

## ప్రపంచంలో పెద్ద రైల్వేస్టేషన్

ప్రపంచంలోని పెద్ద రైల్వే స్టేషన్ - గ్రాండ్ టెర్మినల్, పార్క్ అవెన్యూ మరియు 43వ వీధి, న్యూయార్క్ (యుఎస్ఎ). 1903-31లో నిర్మించబడిన ఈ స్టేషన్‌లో పైనమతలంలో 41 మార్గాలు, క్రింది సమతలంలో 26 దారులు ఉన్నాయి. ఈ స్టేషన్‌ను ప్రతిరోజు 550 పైగా రైళ్ళు 180,000 ప్రయాణీకులు ఉపయోగిస్తారు.

## దేవుడు - పోలీస్

*. దేవుడు మరియు పోలీస్- సంకటం వచ్చినప్పుడే ఎక్కువ ప్రేమతో ఆరాధించబడతారు. శాంతి పునరుద్ధరింపబడి, అన్ని పరిస్థితులు చక్కబడ గానే దేవుడు నిర్లక్ష్యం చేయబడతాడు, పాపం పోలీస్ అమర్యాదగా చూడబడతాడు.*

*— (థామస్ గార్డెన్ నుండి స్వీకారం)*

"నీరులేని మబ్బుతెరలు ఆకాశంలో పైపైన ఎగురుతాయి.'

# సుప్రసిద్ధ శాస్త్రజ్ఞులు

## ఎన్రికో ఫెర్మి

పరమాణువును తొలిసారిగా విభజించి, వేరుచేసిన మొదటివ్యక్తి - ఇటలీలో జన్మించిన అమెరికన్ న్యూక్లియర్ భౌతిక శాస్త్రవేత్త - ఎన్రికో ఫెర్మి. న్యూట్రాన్స్ మరియు న్యూట్రాన్ (అణు సంబంధ) బాంబుల వర్షం అధ్యయనంలో అతడు అగ్రగామి. మొట్టమొదటి అదుపు తెచ్చిన న్యూక్లియర్ ప్రతిఘాతం - 20వ శతాబ్దిలోని గొప్ప భౌతిక శాస్త్ర విప్లవానికి అతడు ఎన్నో సహాయాలు చేసి తోడ్పాటునిచ్చాడు.



Enrico Fermi

1901 సెప్టెంబర్ 29 న ఫెర్మి రోమ్ (ఇటలీ)లో జన్మించాడు. పాఠశాల విద్యార్థిగా అతడు గణితశాస్త్రం మరియు ప్రయోగాత్మక భౌతిక శాస్త్ర గ్రంథాలు పఠించాడు. 17వ ఏట పీసా విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేసేందుకు ఉపకార వేతనం గెలుచుకున్నాడు. 1922లో అక్కడ డిగ్రీ తీసుకుని, గణిత శాస్త్రాచార్యుడు మాక్స్ బర్న్ వద్ద అధ్యయనం చేసేందుకు గోటిన్‌గన్ యూనివర్శిటీకి వెళ్ళాడు. తరువాత అతడు రోమ్ మరియు లైడెన్ విశ్వవిద్యాలయాలలో కొంత అదనపు గ్రాడ్యుయేట్ పని నిర్వహించాడు. 1924లో ఫ్లోరెన్స్ యూనివర్శిటీ శాస్త్ర విభాగంలో ఒక నియామకానికి ఆమోదం తెల్పాడు.

1926 లో ఫెర్మి రోమ్ యూనివర్శిటీలో థియరిటికల్ ఫిజిక్స్ ప్రొఫెసర్‌గా చేరాడు. అతడు విద్యార్థులకు బోధించటంతోపాటు పరిశోధనలు కూడా కొనసాగించాడు. అతి త్వరలోనే రేడియోయాక్టివిటి (అణుధార్మికత)లో బీటా కిరణాల ఉద్గారం (emission of beta rays) గురించి ఒక ప్రధానమైన సిద్ధాంతాన్ని దోష రహితంగా చేశాడు.

అతని పరిశోధన శాలలో ఫెర్మి మరియు సహాయకులు అన్నిరకాల మూల పదార్థాలతో హోరాహోరీగా ఢీ కొన్నారు. యుద్ధ సామగ్రి (మందు గుండు సామాను)గా జోలియట్ క్యూరియస్ అంతకుముందు ఉపయోగించిన అల్ఫా రేణువులను అతడు ఉపయోగించలేదు. దీనికి బదులుగా తన సొంత "బుల్లెట్ల"ను న్యూట్రాన్సుల నుండి తయారు చేసుకున్నాడు. ఈ న్యూట్రాన్లను సర్ జేమ్స్ ఛడ్విక్ రెండేళ్ళ క్రితమే కనుగొన్నాడు. ఇవి అల్ఫా రేణువుల వలే పాసిటివ్‌గా ఛార్జి కాకుండా విద్యుత్ పరంగా తటస్థంగా ఉంటాయి. అల్ఫా రేణువుల మాదిరిగా ఆటం యొక్క ఎలక్ట్రిక్ ఫీల్డ్ చేత తరిమికొట్టేవిగా ఉండవని ఫెర్మి భావించాడు.

## నతాయింపు!

*మీరు అడ్డగించి, ఆపివేయమని చెప్పినా వాగటం మాననప్పుడు కలిగే నతాయింపు (హైరానా) వంటిది మరొకటి ఉండదు.*

"అల్పజ్ఞానానికి అహంకారం అధికం."

తని పరిశోధనలు అతడు సరైన మార్గంలో ఉన్నట్లు చూపుతున్నాయి. అల్ఫా రేణువుల కంటే న్యూట్రాన్లు అత్యంత కార్యసాధకాలుగా ఉంటాయి. వీటి ద్వారా ఫెర్మి 40 కి పైగా మూలపదార్థాలలో కృత్రిమ అణుధార్మికతను ప్రేరేపించి రగిలించాడు.




న్యూట్రాన్లు అత్యంత వేగం కలవిగా ఫెర్మి అచిరకాలంలోనే గ్రహించగలిగాడు. ప్రతి అణువు యొక్క బీజం (మూలకేంద్రం) గురి చూసి కొట్టాలని అతడు కోరుకున్నాడు. కానీ అవి తమ లక్ష్యాన్ని దాటి ముందుకు వెళ్ళలేదు. కొంత పారఫిన్ వాక్స్ ద్వారా ఈన్యూట్రాన్లు తమ లక్ష్యం వైపు వెళ్ళే విధంగా అతడు ఒక వ్యవస్థను నిర్మించాడు. ఇది న్యూట్రాన్ల వేగాన్ని తగ్గించింది. అవి మరింత గొప్ప నిర్దిష్టత చూపటం ప్రారంభించాయి. ఈ "వేగం తగ్గి నెమ్మదిగా సాగే న్యూట్రాన్ల" తో ఫెర్మియురేనియం అణువులతో బాంబుల వర్షం కురిపించి దాన్ని భేదించాడు.

"న్యూక్లియర్ విచ్ఛిత్తి" అని సైన్స్ కలలు కంటున్న దాన్ని తాను సాధించానని ఫెర్మి గుర్తించ లేదు. పొరబాటున తాను ఒక సరి కొత్త మూల పదార్థం - 'ఎకర్‌హీనియం' - సృష్టించానని భావించాడు. "కొత్త రేడియో యాక్టివిటీ మూల పదార్థాల గుర్తింపు, మరియు నెమ్మదిగా సాగే న్యూట్రాన్ల వల్ల ప్రభావితమైన న్యూక్లియర్ రియాక్షన్ ఆవిష్కరణ" అనే పనులకు ఫెర్మికి 1938లో ఫిజిక్స్‌లో నోబెల్ బహుమతి ప్రదానం చేయబడింది.

1939 జనవరిలో ఫెర్మి ఇటలీ విడిచిపెట్టి భార్యా, ఇరువురు బిడ్డలతో అమెరికా చేరు కున్నాడు. అతడు తన కుటుంబంతో కలిసి యునైటెడ్ స్టేట్స్‌లో స్థిరపడ్డాడు. అతడు కొలంబియా యూనివర్సిటీలో ఫిజిక్స్ ప్రొఫెసర్‌గా నియమించబడ్డాడు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో 1939 మరియు 1942 మధ్యకాలంలో యూనివర్సిటీలో యురేనియంపై జరిగిన పరిశోధనకు ఆధిపత్యం వహించాడు.

1942 తొలిదశలో ఫెర్మినీ, అతని ఉద్యోగ బృందాన్ని ప్రభుత్వం చికాగో యూనివర్సిటీకి తరలించింది. అణువులోని అపారశక్తి విడుదల అయినప్పుడు ఆవశ్యకమయ్యే ఆటమిక్ కుప్ప (పోగు) నిర్మించే పని వీరికి అప్పగించ

## రొంపనుండి తప్పించుకునే పద్ధతి

*రొంప (పడిశం) విస్తృతం కాకుండా చేసే అత్యంత శక్తివంతమైన పద్ధతి - చేతులు శుభ్రం చేసుకోవటం. మీకు రొంప పడితే, అది మీ వ్రేళ్ళ ద్వారా ప్రాకిపోతుందని మర్చిపోవద్దు. కనుక వీటిని సబ్బు, వేడినీళ్ళతో వీలైనంత తరచుగా శుభ్రం చేస్తూ ఉండండి. మీ చుట్టూ ఉన్నవారికి పడిశం పడితే, మీ చేతుల్ని తరచుగా శుభ్రపర్చుకోండి. మీ ముక్కులోకీ, కళ్ళలోకీ మీ వ్రేళ్లను జొప్పించ కండి.*

*— "హెరాల్డ్ ఆఫ్ హెల్త్" సౌజన్యంతో*

బడింది. ఒక స్క్వాష్ కోర్టులో అతడు ఆటమిక్ కుప్పను తయారుచేశాడు. ఇది ఒక ద్వారపు పిడి (ముడి) వలె ఆకృతి ధరించింది. ఇది గ్రాఫైట్ రాళ్ళతో, మూలల్లో బిగించిన యురేనియం ముక్కలతో నిర్మించ బడింది. దీని నిర్మాణం పూర్తి చేసేందుకు, పని మొదలు పెట్టేందుకు వీలుగా అతడు రోజుకు 20 గంటలపాటు పనిచేశాడు.

1942 డిసెంబర్ 2 న ఈ పరమాణు (ఆటమిక్) కుప్ప పరీక్షకు సిద్ధమైంది. 40 మంది సాక్షుల ఎదుట అతడు, అతని ఉద్యోగ బృందం మొట్టమొదటి స్వయం పోషకమైన న్యూక్లియర్ ఛెయిన్ రియాక్షన్‌ను ప్రదర్శించి చూపారు. గ్రాఫైట్ బ్లాక్‌లలో యురేనియం ఆటమ్స్, లోతుగా ఒక నమూనా ప్రకారం స్థిరపర్చబడ్డాయి. ఇవి ఇరుగున కల ఆటమ్స్‌తో ఢీకొని సంఘర్షించేందుకు, ఒక చెయిన్ రియాక్షన్ ప్రారంభించి ఆటమ్స్‌ను ఛేదించేందుకు ఉత్తర్వులివ్వబడ్డాయి. వేడిమి రూపంలో అత్యంత హెచ్చు పరిమాణంగల న్యూక్లియర్ ఎనర్జీ ఈ ఆటమ్స్ విచ్ఛేదన ఫలితంగా ఉద్భవించింది. ఆరోజు నుండి ఆటంబాంబు నిర్మాణం నిశ్చయమైపోయింది.

అనంతరం ఫెర్మి న్యూ మెక్సికోలోని లాస్ అలమాస్ వద్దగల ఆటమిక్ బాంబ్ కర్మాగారం విడిచి బయటికి వచ్చాడు. మొదటి ఆటమిక్ బాంబుల వాస్తవ నిర్మాణానికి సంబంధించి ప్రసిద్ధ శాస్త్రవేత్తలైన జె. రాబర్ట్ ఒప్పెన్ హైమర్ మరియు నియల్స్ బోహ్రన్‌లతో కలిసి పనిచేశాడు. ప్రపంచ యుద్ధానంతరం అతడు ఫిజిక్స్ ప్రొఫెసర్‌గా చికాగో యూని వర్సిటీకి తిరిగివచ్చాడు.

ఎన్రికో ఫెర్మి 1954లో కాలధర్మం చెందాడు.

## ఏకాగ్రతను వృద్ధిచేసుకో



మనం ఏకాగ్రతను పెంపొందించుకుంటే మన మానసిక శక్తి పెరుగుతుంది. సూర్యునివైపు చూపినంత మాత్రాన కాగితం ముక్క మండిపోదు. సూర్య కిరణాలను కుంభాకార కటకంలో ఏకమ్ముఖం చేసినప్పుడు కేంద్రనాభిలోని వేడిమి తీవ్రత చెంది కాగితం అంటుకుంటుంది. అదే విధంగా సక్రమమార్గంలో మన మానసిక శక్తులు పయనించనప్పుడు, అతి త్వరితంగా అవి విచ్ఛిన్నమై (చెల్లాచెదరై) మేథను బలహీనం చేస్తాయి ఒక అస్థిరమైన, ఊగులాడే, వ్యాకుల చిత్తం - అన్ని రకాల విభ్రమాలకు, విద్వేషాలకు మరియు జటిలత (క్లిష్టత) లకూ లోబడిపోతుంది.

## అదికాదు!

మనం తినేది కాదు, మనం జీర్ణించుకునేదే
మనల్ని శక్తివంతుల్ని చేస్తుంది.
మనం సంపాదించేది కాదు, మనం కూడబెట్టేదే
మనల్ని భాగ్యవంతుల్ని చేస్తుంది.
మనం చదివేదికాదు, మనం జ్ఞాపకం పెట్టుకునే,
మనల్ని విజ్ఞానవంతుల్ని చేస్తుంది.
మనం బోధించేది కాదు, మనం అభ్యసించేదే
మనల్ని గొప్పవారిని చేస్తుంది.

"నిప్పువల్ల ఏర్పడిన పుండు సులభంగా మానిపోతుంది. నాలుక వల్ల ఏర్పడ్డ పుండు ఎప్పటికీ మానదు."

# ఉబ్బసానికి ఉత్తమ చికిత్స

హెచ్.కె. బఖ్రూ

ఆస్థ్మా (ఉబ్బసం లేక శ్వాసకోశం) - ఒక ప్రాచీన గ్రీకు శబ్దం. దీని అర్థం "తొందరగా శ్వాసించటం (లేదా) హ్రస్వంగా పీల్చుకునే ఊపిరి." ఇది శ్వాసక్రియకు సంబంధించిన వ్యాధులలో అత్యంత ఇబ్బందికరమైనది. ఆస్థ్మా రోగి శ్వాస పీల్చలేని పరిస్థితికి తరచుగా గురవుతాడు. ఈ మధ్య సమయంలో మామూలుగానే ఉంటాడు.




అకస్మాత్తుగా వచ్చి పడే ఆస్థ్మా తరచుగా దగ్గుతో ముంచుకు వస్తుంది. గడ్డం దగ్గర, మెడ వెనుక, ఱొమ్ముదగ్గర దురదతో కలిసి వస్తుంది. ఆస్థ్మా క్రమేణా పైబడగానే, శ్వాసకోశపు అంటు వ్యాధిని సహజంగానే తన వెంట తీసుకు వస్తుంది. ఆస్థ్మా తీవ్రంగా దాడి చేసినప్పుడు హృదయస్పందన, శ్వాసక్రియ హెచ్చుతుంది. రోగి నెమ్మది లేకుండా అలసటతో ఆయాసపడుతూ ఉంటాడు. దగ్గు ఉండవచ్చు. ఱొమ్ము బిగువుగా ఉండవచ్చు. విపరీతంగా చెమటలు, వాంతులు ఉండవచ్చు. దగ్గు తీవ్రంగా ఉన్నట్లయితే ఉదర సంబంధమైన నొప్పి కూడా ఉండవచ్చు. పొగ మంచు వాతావరణం ఆస్థ్మా చిహ్నాలను ప్రకోపింపచేస్తుంది.

ఆస్థ్మా - అనేక విధాలైన కారణాలవల్ల వస్తుంది. విభిన్న వ్యక్తులకు పలు విధాలుగా మారే వాతావరణం, ఆహారం, ఔషధాలు, పరిమళ ద్రవ్యాలు, ఇంకా ఇతర బాధాకరమైన వస్తువుల ప్రతిక్రియ వల్ల ఏర్పడిన ప్రతికూల (allergic) పరిస్థితి వల్ల చాలామందికి ఆస్థ్మా వస్తుంది. దుమ్ముకు సంబంధించిన ప్రతికూలత - చాలా సాధారణంగా ఉంటుంది. కొందరు వ్యక్తులు ప్రత్తి (దూది) దుమ్ము, గోధుమ ధూళి మరియు కాగితపు ధూళి వంటి వివిధ ధూళులపట్ల సున్నితంగా ఉంటారు. కొందరు కొన్ని పుప్పొడులకు, జంతువుల వెంట్రుకలకు, నాచుకు, క్రిమికీటకాలకు ముఖ్యంగా బొద్దింకలకు అలెర్జీ కలిగి ఉంటారు. గోధుమలు, గ్రుడ్లు, పాలు, చాకొలెట్సు, బీన్స్, పొటాటో, పంది మాంసం, గొడ్డు మాంసం వంటి ఆహార పదార్థాలు కూడా సాధారణంగా అలెర్జీ కలిగిస్తాయి.

ఇతరులకు ఆస్థ్మా అసాధారణ శరీర రసాయనిక విధానం - ఎంజైముల పద్ధతి లేదా ఊపిరితిత్తుల కండరాల పనిలో లోపం - కారణంగా రావచ్చు. అయితే అతి తరచుగా ఆస్థ్మా - అలెర్జీ, నాన్ అలెర్జీ కారణాలైన మానసికమైన ఆందోళన, వాతావరణ కాలుష్యం, అంటు వ్యాధులు మరియు వంశపారం పర్య కారణాలవల్ల కూడా రావచ్చు.

రోగికి పురీషనాళం శుద్ధి చేసేందుకు,

## సీజర్ చేవ్రాలు

*రోమన్ రాజనీతివేత్త జూలియస్ సీజర్ (102-44బి.సి) ఆటోగ్రాఫ్ (చేవ్రాలు) విలువ 2 మిలియన్ పౌండ్ల కంటే ఎక్కువగా ఉన్నదని చెబుతున్నారు.*

"ప్రతికార్యమును తనకు నచ్చినట్టు చేయగలవాడు ప్రజ్ఞాశాలి."

మత్తు, మైకం వదిలేందుకు ఎనిమా ఇవ్వాలి. జీర్ణం కాని ఆహారం వల్ల ఏర్పడిన పులిసిన పొంగును ఉదరంపై ఉంచిన మట్టి సంచులు నివారణ కలిగిస్తాయి. ప్రేగుల్లో క్రుళ్ళిన ఆహార పదార్థాలను శుభ్రపరుస్తాయి. తేమగల మూటలను రొమ్ముపై ప్రయోగించాలి. ఇది ఊపిరి తిత్తులలోని ఇరుకుదనం నుండి ఉపశమనం కలిగిస్తుంది. వీటిని దృఢం చేస్తుంది. ఆవిరి నీటి స్నానం, వేడి నీటి (పాదాల వరకు) స్నానం, వేడినీటి తుంటి స్నానం, సూర్యస్నానం చేస్తూన్న రోగికి చెమట పట్టేటట్లు చూడాలి. దీనివల్ల చర్మం ప్రోత్స హించబడి గడ్డ కట్టిన, ఇరుకైన ఊపిరి తిత్తు లకు ఉపశమనం కలుగుతుంది.

తేనెతో కలిపిన నిమ్మరసం తీసుకుంటూ రోగి కొన్ని రోజులపాటు ఉపవాసం చేయాలి. శరీర విధానానికి సత్తువ కలిగించేందుకు, విష పదార్థాలను నిర్మూలించేందుకు అతడు తరువాత పండ్ల రసం ఆహారంగా తీసుకోవాలి. క్రమేణా ఘన ఆహారాన్ని చేర్చుకోవాలి. అయితే రోగి సాధారణ ఆహారపు పొరపాట్ల నుంచి వైదొలగాలి. కార్బోహైడ్రేట్స్, క్రొవ్వులు, ప్రొటీన్లు - ఇవి ఆసిడ్ తయారు చేసే వస్తువులు - కొద్ది పరిమాణంలోనూ, ఆల్కలైన్ ఆహార పదార్థాలైన తాజాపండ్లు, పచ్చని కూరగాయలు, మొలకెత్తే కాయ ధాన్యాలు అధిక పరిమాణంలోనూ తీసుకోవటం రోగికి, ఆదర్శమైన ఆహారంగా ఉంటుంది. బియ్యం, చక్కెర, ఒక రకమైన బీన్స్ వంటి కఫం, కళ్ళె ఉత్పత్తి చేసే ఆహార పదార్థాలను విసర్జించాలి. సూర్యాస్తమయం కాకముందే రాత్రి భోజనం ముగించాలి. లేదా నిద్రకు ఉపక్రమించేందుకు కనీసం 2 గంటల ముందుగా భుజించాలి.

రోగిపై ఆస్త్మా దాడి జరిగినప్పుడు కొద్ది కర్పూరంతో మిశ్రమం చేసిన ఆవ నూనెను రొమ్ముపైనా, వెనుక ప్రక్కా రుద్ది తోమాలి. దీనివల్ల కఫం తేలికై ఊపిరి పీల్చుకోవటం సులభమవుతుంది. సీమసోపిత్తులు (caraway) కలిపిన వేటినీటి ఆవిరిని రోగి పీల్చాలి. ఇది శ్వాసకోస మార్గాన్ని విస్తరింపచేస్తుంది.

రోగి దుమ్ముతో కూడిన స్థలాలను, శీతలాన్ని విసర్జించాలి. సున్నితంగా భావించే ఆహార పదార్థాల్ని విడనాడాలి. మానసిక క్లేశాలను, ఒత్తిడులను విడనాడాలి. యోగముద్ర, సర్వాంగాసనం, పద్మాసనం, భుజంగాసనం, ధనురాసనం, శలభాసనం మరియు శవాసనం వంటి యోగాసనాలను కూడా అతడు అభ్యాసం చేసుకోవాలి.

## ప్రపంచ తపాలా దినంగా అక్టోబర్ 9 పరిగణన



*ప్రతి సంవత్సరం అక్టోబర్ 9 ప్రపంచ తపాలా దినోత్సవంగా పరిగణించబడుతున్నది. 1874లో ఇదే రోజున ఏకైక విశ్వవ్యాపిత తపాలా ప్రదేశం అనే భావనతో యూనివర్సల్ పోస్టల్ యూనియన్ (యుపియు) స్థాపించబడింది. జాతీయ తపాలా అల్లికల యొక్క సమైక్యం ద్వారా సేవలో నాణ్యతకు ప్రాధాన్యం ఇవ్వాలనే హాంబర్గ్ ప్రకటనను యుపియు తన సభ్య దేశాలతో కలిసి అంగీకరించింది.*

"చీపురు కట్ట స్వతహాగా మురికి దయినా అది వూడ్చేచోటుని పరిశుభ్రంగా ఉంచుతుంది."

ప్రస్తుతం సముద్రాలన్నీ సహాయం కోసం అరుస్తున్నాయి. నీలిసాగరంలోకి నెమ్మదిగా ప్రాకిపోయే ఒకే ఒక నిజమైన రంగు - కల్మషం చేయబడిన నదులు, నగర మురుగు కాలువలు, పారిశ్రామిక అడుసు, తమ పడవలను శీఘ్రంగా నడుపుకుంటూ పోయే మిలియన్ల కొద్దీ పర్యాటకులు సముద్రంలోకి ఒంపి ఖాళీ చేసే చెత్త - వీటితో తయారైన నల్లని గోధుమ రంగు మురికి. నేడు మన మహాసముద్రాలలో కనిపించే బాగా పరిచిత దృశ్యాలు - నూనె తెట్టలు, వ్యర్థ పదార్థాల ప్రోగులు మరియు చచ్చిన చేపలు మాత్రమే.



విస్తారమైన, సుడి తిరిగే సముద్రం - ఒక ఓడ పైభాగం నుంచి క్రిందికి దింపబడిన కరెంట్ మీటర్లు, మడ్డి నమూనాలు తీసే యంత్రాలు, నీటి నమూనా పరికరాలు, ధర్మో మీటర్ల వంటి అతిసూక్ష్మ పరికరాల ద్వారా చెదురుమదురుగా అక్కడికక్కడ జరిగే కొలతల వల్ల వాస్తవం అవగతం కాదు. ప్రపంచంలోని నీటి పద్ధతిని పదిలపర్చటం, రక్షించుకోవటం, దీనిపట్ల శ్రద్ధ వహించటం అత్యంత ఆవశ్యకం.

అన్ని దేశాల మధ్య వ్యాపార నౌకా, యుద్ధ నౌకా సంబంధమైన న్యాయమైన విభాగాలు చేసుకునేందుకు ప్రస్తుతం సమయం ఆసన్నమైంది. ప్రపంచ నాయకులు సముద్ర సంబంధ యుద్ధ నౌకా, వాణిజ్య నౌకా వనరులను విభాగించుకునేందుకు బదులుగా - కసాయి వాళ్ళు పశువులను వధించినట్లుగా - సముద్రాన్ని చీలికలు చేసేందుకు ప్రయత్నిస్తున్నారు. వివిధ దేశాలకు చెందిన ప్రముఖ రాజకీయ నాయకులు, మరియు ప్రపంచ నేతలకు ఒకే ఒక నీలి సముద్రం ఉన్నదనే వాస్తవికత గ్రహించుకునేందుకు - వ్యోమశకటం - బాగా ఉపయోగపడవచ్చు.

సముద్రానికి ఎల్లల ఉపయుక్తత లేదు. ఇక్కడ తిమింగిలాలు, డాల్ఫిన్ (సముద్ర జలచరాలు), సాల్మన్ జాతి చేపలు, హెర్రింగ్స్ (ఒకరకం చిన్న చేపలు), స్క్విడ్స్, టునా మరియు ఇతర చేపలు తమ జీవితాల్ని గడుపుతూ, సముద్రంలో స్వేచ్ఛగా సంచరిస్తూ, ఒక దేశం తర్వాత మరోదానికి వెళ్తుంటాయి

## ఆరోగ్య రక్షణలో తపాలాశిక్షణ

*ఈ క్రింది శాఖల్లో - ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హెల్త్ కేర్ అడ్మినిస్ట్రేషన్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ డిస్టెన్స్ ఎడ్యుకేషన్, మద్రాసు - 600 091 - ఒక ఏడాది డిప్లొమా కోర్స్ (కరస్పాండెన్స్) అందిస్తున్నది:*

*హాస్పిటల్ అడ్మినిస్ట్రేషన్, హాస్పిటల్ పర్సనల్ అడ్మినిస్ట్రేషన్, పబ్లిక్ హెల్త్ అడ్మినిస్ట్రేషన్, నర్సింగ్ అడ్మినిస్ట్రేషన్, న్యూట్రిషన్ అండ్ డయిటిటిక్స్, హెల్త్ ఎడ్యుకేషన్, సైకలాజికల్ కౌన్సెలింగ్, ఫామిలీ లైఫ్ ఎడ్యుకేషన్, ట్రైనింగ్ అండ్ డెవలప్‌మెంట్, హ్యూమన్ రిసోర్సెస్ డెవలప్‌మెంట్, బిజినెస్ అడ్మినిస్ట్రేషన్, మార్కెటింగ్ మేనేజ్‌మెంట్.*

*— 'పార్థ' సౌజన్యంతో*

"మహాత్ములు మహానదుల వంటివారు. నిరంతరం చలిస్తున్నా నిశ్చలంగానే ఉంటారు."

ఒక తీరం వెంట విషయుక్తమైన పదార్థాలతో సముద్రపు నీరు కళంకితం అయినట్లయితే, అది ఆ విషాన్ని ప్రపంచమంతటా చెల్లా చెదురుగా వ్యాపింపచేస్తుంది. ఆర్కిటిక్ ధ్రువ సంబంధపు ఎలుగుగొడ్లలోనూ, అంటార్కిటిక్ పెంగ్విన్స్ (సముద్రపు పక్షులు) కాలేయాల్లోనూ డి.డి.టిని ఇప్పటికే శాస్త్రవేత్తలు కనుగొనటం జరిగింది.

ముప్పై సంవత్సరాల క్రితం వాతావరణంలో న్యూక్లియర్ పరీక్షలు జరిగినందు వల్ల ఏర్పడిన కిరణ ప్రసారం (ప్రకాశవ్యాప్తి) సముద్ర మంతటా వ్యాపించి పగడపు జాతి చట్టుల కార్బన్ కాల నిర్ణయానికి సంబంధించిన శాస్త్రీయ విశ్లేషణ వంటి పనులు జరగటం దుస్సాధ్యం చేస్తున్నది.

తిమింగిలాలు నశించిపోయే ప్రమాదంలో ఉన్నాయి. స్మారక (స్మృతిచిహ్నం) నౌకలకు అలంకరణ పగడం (ప్రవాళం) సరఫరా చేసేందుకు ప్రతిరోజు మైళ్ళ తరబడి పగడపు రాతి చట్టు ధ్వంసం చేయబడుతున్నది. పడవ పైనుంచి తమ వ్యర్థ పదార్థాలను - సరకుల ఓడలు, రెండు తెరచాప స్తంభాల ఓడలు, యుద్ధ నౌకలు మరియు విలాస నౌకలు - క్రిందికి త్రోసి వేస్తున్నాయి. వీటిలో కొంత చెత్తను సముద్రం తనలో ఇముడ్చుకుంటుంది. కానీ అధికభాగం - జీవించే ప్రాణులకు అపాయం కలిగిస్తుంది లేదా శాశ్వత సముద్రపు కుప్పగా మిగిలిపోతుంది. హార్బర్‌లో పరిశుభ్రపర్చే సౌకర్యాలను ఉపయోగించుకోవటం ద్వారా మూల్యం చెల్లించటాన్ని తప్పించుకునేందుకు కొన్ని నూనె టాంకర్లు తమ చెత్తా చెదారాల్ని సముద్రంలోనే విడిచి పెడతాయి. ప్రమాదకరమైన పారిశ్రామిక వ్యర్థ పదార్థాలు, శక్తిగల గ్యాస్ చిప్పలు, అణువ్యర్థ పదార్థాలు సైతం సముద్రంలో పారబోయటం జరుగుతున్నది. వీటిని ప్రమాద రహితంగా చేసేందుకు అయ్యే ఖర్చును తప్పించుకునేందుకు వీరు ఇలా చేస్తున్నారు.

ప్రపంచంలోని కోస్తా తేమ నేలలు - హోటల్సు, అపార్ట్‌మెంట్స్, విలాస కేంద్రాలుగా - మార్చబడ్డాయి. ఈ బురద ప్రదేశాలు మిలియన్ల కొద్దీ చేపలను, పక్షులను పోదుగుతాయి. రియల్ ఎస్టేట్ అభివృద్ధికి ఈ ముఖ్యమైన ప్రదేశాలను ఉపయోగించినప్పుడు సముద్రం ఒక ఘోరమైన మూల్యం చెల్లిస్తుంది. కనుక మితిమీరి చేపలు పట్టటం, మితిమీరిన అభివృద్ధి కూడా నీటి విధానం యొక్క సున్నితమైన సమతౌల్యానికి ప్రమాదం కల్గిస్తుంది.

## 100 మిలియన్ ప్రజానీకం



*ప్రస్తుతం ప్రపంచంలోని 100 మిలియన్ ప్రజలు ఆరు బయటకానీ, తలదాల్చుకోవడానికి వీలులేని వీధుల్లోకానీ నిద్రిస్తున్నారు. దాదాపు ఒక బిలియన్ (1000 మిలియన్) ప్రజలు - ఆక్రమిత నివాసస్థలాలలో కానీ, మురికివాడలలో కానీ నివసిస్తున్నారు - తరచుగా వీరికి నీరు, విద్యుత్, మురుగు పారుదల సదుపాయం ఉండదు.*

# టెలివిజన్ కళ్ళకు తెచ్చే తంటా

డా.ఇ. వైథిలింగం

అనేక కుటుంబాలలో టెలివిజన్ చూడట మనేది విద్యా విషయికమైన వినోద కాలక్షేపంగా పరిగణించబడుతున్నది. టెలివిజన్ చూడటం కళ్ళకు మిక్కిలి హానికరమని విశ్వసిస్తున్న వారు కొందరు ఉన్నారు. టెలివిజన్ చూసేవారు కొన్ని నిబంధలను కఠినంగా పాటించ గల్గేటట్లు చేసి, టెలివిజన్ సెట్‌ను సక్రమంగా నెల కొల్పినట్లయితే టెలివిజన్ చూడటం హానికరం కాబోదు.



చీకటి గదిలో టెలివిజన్ చూడటం కంటికి మంచిది కాదు. తెరకు, దాని చుట్టూగల ప్రదేశానికి మధ్యగల ఎక్కువ వ్యత్యాసం తగ్గించేందుకు గదిని మృదువుగా ప్రకాశింప చేయాలని లైటింగ్ ఇంజనీర్లు, దృష్టి నిపుణులు సిఫార్సు చేశారు. గది చీకటిగా ఉంటే వ్యత్యాసం అధికంగా ఉండి అసౌఖ్యానికీ, బలహీనదృష్టికీ దోహదం చేస్తుంది. అయితే గదిలో సాధారణ వెలుతురు ఉన్నట్లయితే, కంటికి ప్రయాస కలగకుండా ఎవరైనా బొమ్మను చూడవచ్చు. గదిలోని సాధారణ వెలుతురు - సంభాషణ వగైరాలకు కావలసినంత మేరకు ఉండాలి. తెరపై కానీ, తెర సమీపంలో కానీ ప్రత్యక్ష ప్రతిబింబం పడకుండా దీపాల వెలుతురు అమర్చుకోవాలి. తెరకు అతి దగ్గరగా ఉన్న చుట్టుప్రక్కల ప్రదేశంలో తెరపై కాంతికంటే 1/4 నుంచి 1/2 కాంతి ఉంటే చాలు. గది మారుమూలలలో తెరపై కాంతికంటే 1/10 వంతు కాంతి ఉండాలి.

సినిమా హాళ్ళలో చీకటి ఎందుకు ఉంటుందని పాఠకులు ప్రశ్నించేందుకు కుతూహల పడుతుండవచ్చు. ప్రేక్షకుల దృష్టిని హాలుచుట్టూ ఉన్న - పరధ్యానం కలుగజేసే - దృశ్యాల పైనుంచి మరల్చి, ఫ్రేముల మధ్యవచ్చే చీకటి మధ్య (విశ్రాంతి) కాలాల్లో అప్రమత్తత లేకుండా మందగింప చేసేందుకు సినిమా హాళ్ళను ఎప్పు చీకటిగా ఉంచుతారు. ఇదికాక సినిమా హాలు సినిమా తెరయొక్క భారీసైజు, చూసేవ తెర సుదూరంలో ఉండటం - ఈవ్యత్యాసం వల్ల వచ్చే సమస్యల్ని తగ్గిస్తుంది.

తెరపై బొమ్మ వైశాల్యానికి 5 రెట్లుగా ఉండే దూరం నుంచి టెలివిజన్ చూడాలి. ఒక సాధారణ నిబంధన ఏమంటే గదికి అడ్డంగా - (అటునుంచి ఇటు) టెలివిజన్ చూడటం. తెరకు చాలాదూరం నుంచి టెలివిజన్ చూసి నట్లయితే బొమ్మ వివరాలు నిశితంగా, శ్రేష్ఠంగా, కనిపిస్తాయని తెలుసుకున్నారు. దూరం నుంచి

## ఇతరుల లోపాలు

*ఇతరుల లోపాలను ఎత్తి చూపటం వల్ల మిగిలిన మూడు వ్రేళ్ళు మనవైపుకే సూచిస్తాయి. దీని అర్థం: ఆత్మ విశ్లేషణ - ఇతరుల తప్పులను కనుగొనటం కంటే మూడురెట్లు ఎక్కువ అవసర మని చెప్పటం!*

"నివురు గప్పిన నిప్పులా బయట పడకుండా రగిలే ఆగ్రహం అత్యంత ప్రమాదకరం."

చూస్తే వికారాలు, వికృతాలు, గీతలు మరియు విద్యుత్ కంపనాలు - ఇవన్నీ దాదాపు కన్పించవు. పిల్లలు సహజంగా టెలివిజన్ సెట్‌కు దగ్గరగా కూర్చోవాలని కోరుకుంటారు. దీనిని ప్రోత్సహించకూడదు. గదికి అడ్డంగా టెలివిజన్‌ను పసిబిడ్డ చూడటంలో అసౌకర్యం అనుభవిస్తే ఆబిడ్డకు ఏదో ఒక కంటి లోపం ఉండవచ్చు. దృష్టి పరీక్ష చేస్తే కారణం అవగతమౌతుంది.

ప్రతివారూ అప్పుడప్పుడు తెరపై నుండి తమ దృష్టిని మరల్చి గదిని కలయ చూడటమో, కీ బయటికి చూడటమో చేయటం అవసరం. దీనివల్ల కంటికి కొంత విశ్రాంతి ఇవ్వటం, కొంత సడలింపు ఇచ్చి సేద తీర్చటం జరుగుతుంది. టెలివిజన్ సెట్ కూడా కంటి సమతలానికి అనువుగా అమర్చుకోవాలి. దీనివల్ల బొమ్మ వంక పైకీ, క్రిందికీ చూసే ప్రయాస తప్పుతుంది. ఒక వ్యక్తి రోగగ్రస్థుడై ఉన్నప్పుడు, ముఖ్యంగా అధిక ఉష్ణోగ్రత కల్గి జ్వరం తగిలినప్పుడు, టెలివిజన్ చూడకూడదు. బొమ్మ చూస్తున్నప్పుడు ఒక వ్యక్తికి కంట నీరు కారినా, కళ్ళు బాధ పెట్టినా దృష్టి పరీక్ష అవసరం కావచ్చు. టెలివిజన్ చూసేందుకు కళ్ళద్దాలు ధరించిన వారు తమ అద్దాలను (దూరం కోసం) దిద్దుబాటు చేయించుకోవాలి. టెలివిజన్ చూసేటప్పుడు గాగుల్స్ (సులోచనాలు) పెట్టుకోవటం అవసరం. కాంతిపట్ల సున్నితంగా ఉండే వ్యక్తులకు సులోచనాలు అవసరం కావచ్చు.

తాము తరచుగా టెలివిజన్ చూసినందువల్ల తమ కంటిదృష్టి మరింత క్షీణిస్తుందని మయోపియా (హ్రస్వ దృష్టి గలవారు) బాధితులు భయపడనక్కరలేదు. గదికి అడ్డంగా టెలివిజన్‌ను వారు అప్పుడు కూడా చూడవచ్చు.




## ద్రవం ఎక్కువ ఉండే టొమాటో

*ఒక టొమాటోలో ఒక గ్లాసు పాలకంటే హెచ్చుగా ద్రవం ఉంటుంది.*

## ఎక్కువ బరువు తూగే మెగ్నీసియం

*మండిన తరువాత మెగ్నీసియం ఎక్కువ బరువు తూగుతుంది. లోహం కంటే బూడిద బరువు ఎక్కువగా ఉంటుంది.*

## నిలిచిన మానవ హృదయ చలనం




*గుండె కొట్టుకునే క్రియ మధ్యలో సెకండ్‌లో 1/6వ వంతు కాలం మానవ హృదయ చలనం నిల్చిపోతుంది. దీని ఫలితంగా మీ జీవితకాలంలో - 1/6వ వంతుకు సమానమైన కాలమంతా చేర్పబడి హృదయ చలనం జరుగుతుంది.*

## ప్రపంచంలో తీపి మొక్క

*ప్రపంచంలో అతి తీపి మొక్క పరాగువా (దక్షిణ అమెరికా)లో పెరుగుతుంది.*

"ఎంతటి మూఢుడైనా తనకు నచ్చిన కార్యాన్ని చక్కగా నిర్వహిస్తాడు."

# మీ వివాహబంధం కలకాలం నిలవాలంటే...

ప్రకాశవంతంగా కనిపిస్తున్న పెళ్ళి కుమార్తెలు, ఆసక్తితో నిండిన పెళ్ళి కుమారులు ఉల్లాసప్రదమైన ఆశలతో మనకు ఎక్కడైనా కనిపిస్తారు. వారు వైవాహిక జీవితపు మార్గం వెంబడి బయలుదేరుతున్నారు - కొన్నేళ్ళ తరువాత వివాహం వల్ల ఏర్పడిన భ్రమలు తమకుతామే గ్రహించుకుంటారు. ఈ విచారకర పరిస్థితి ఏర్పడేందుకు కారణమేదైనా, మానవ మనస్తత్వ అవగాహన - ఒక సుఖదాయకమైన వివాహం కొనసాగేందుకు - ఎంతైనా తోడ్పడుతుంది.



ఈరోజుల్లో వివాహంలో ఎక్కువ ప్రాముఖ్యత - కలిసి ఉండటం-పై మోప బడుతున్నది. వివాహం - అనే దానిలోనే ఒక అన్యోన్యస్థితి కనిపిస్తుంది. ఒకరు తన భాగస్వామిని మరింత సన్నిహితంగా, దగ్గరగా కట్టివేసి బంధించటం వల్ల అది అతడు (లేక) ఆమెకు బాధ కలిగించి, సులభంగా కోపం తెప్పించి, స్వేచ్ఛ కోసం పోరాడవచ్చు. కలిసి ఉండటం అనేది - ప్రత్యేకంగా, ఒక ప్రక్కగా - కొంత దశ వరకు ఒక జలతారు అల్లికవలే ఉంటే అది వాస్తవమైన అర్థ వంతంగా రూపొందుతుంది.

భర్త తన మిత్రులతో ఒక పర్యటనలో ఉండి ఆనందిస్తున్న సమయంలో తల్లి ఇంట్లో అతని భార్య వారాంతాన్ని గడపటం వల్ల వారి స్వారస్యంలేని వివాహంలో ఒక మెఱుపును తిరిగి ప్రకాశింప చేయవచ్చు. భాగస్వాము లిద్దరూ ఈ తాత్కాలిక వియోగంలోకి హృదయ పూర్వకంగా ప్రవేశించాలి.

ఇంటి వెలుపల తమ భార్యలకు గల అభిరుచుల పట్ల కొందరు భర్తలు దురభి ప్రాయం కలిగి ఉంటారు. తన భార్య వెలుపలి అభిరుచులు తననుండి ఆమెను దూరం చేస్తాయని భర్త భావిస్తూ ఉండవచ్చు. లేదా ఆమె సాధించిన కార్యాలు తనను అతిక్ర మించి పోతాయనీ భావిస్తూ ఉండవచ్చు. గృహ నిర్వహణను దాటి తమ ప్రతిభ, ప్రజ్ఞలకు ఒక సృజనాత్మకమైన ద్వారం కావాలని అనేక మంది స్త్రీలు కోరుకునే విషయం కాదనలేము. ఆమె సృజనాత్మక ప్రతిభా సామర్థ్యాల పట్ల భర్త అకారణంగా ఆగ్రహం ప్రదర్శిస్తే అప్పుడు ఆ స్త్రీ నిరుత్సాహం చెంది, నిరాశపడుతుంది. ఒక సుఖప్రదమైన వైవాహిక జీవితానికి-తన భార్య కావాలని కోరుకునే-జీవిత క్రమాన్ని భర్త అంగీకరించాలి. అయితే ఆమె తన ఇంటిని నిర్లక్ష్యం చేయకూడదు. లేదా ఆమెకు వర్ణచిత్ర (పెయింటింగ్) రచన, పుస్తకరచన లేదా ఒక సంగీత వాద్యం వాయించే ప్రజ్ఞ ఉన్నట్లయితే, వాటిని ఆమె అభివృద్ధి చేసు కునేందుకు అంగీకరించాలి.

## నిరాశావాది - ఆశావాది

*ఆశావాది చెప్పే మాటలు: "గ్లాసు సగం నిండింది" నిరాశావాది చెప్పే మాటలు: "గ్లాసు సగం ఖాళీగా ఉంది."*

"చితి చచ్చిన దేహాన్ని కాలుస్తుంది. కాని చింత బ్రతికిన మనిషినే కాలుస్తుంది."

# మీకు తెలుసా?

## భూమి పరిసరాల పతనానికి కారణాలు

భూమి యొక్క పరిసరాల పతనానికి కారణాలు: అధిక స్థాయిలో వినియోగం, జనాభా పెరుగుదల, మరియు దారిద్ర్యం.



## ప్రపంచ ఆదాయంలో 85 శాతం

ప్రపంచ ఆదాయంలో 85 శాతం సంపన్న వినియోగదారులైన 23 శాతంమంది ప్రజలకు చేరుతుంది.

## ఆగర్భ దరిద్రులు

ఒక బిలియన్ పైగా ప్రజలు సంపూర్ణమైన దరిద్రంలో ఉన్నారు. ఒక రోజుకు ఒక డాలర్ కన్నా తక్కువ డబ్బుతో జీవిస్తున్నారు.

## కార్బన్ డైఆక్సైడ్‌వల్ల వాతావరణ స్థితి

వేడిమిని చేజిక్కించుకునే కార్బన్ డైఆక్సైడ్ యొక్క శీతోష్ణస్థాయి ప్రస్తుతం ఏకీకృత పారిశ్రామికీ కరణం నాటికంటే 26 శాతం హెచ్చుగా ఉన్నది. ఇది మరింత పైకి ఎగబ్రాకవచ్చు.

## వెచ్చని సంవత్సరం

19వ శతాబ్ది మధ్యభాగం నుండి నమోదు చేయబడుతున్న ప్రకారం - అంతకుముందు ఏ సంవత్సరం కంటే 1990లో భూమి ఉపరితలం వెచ్చదనంతో ఉన్నట్లు తెలుస్తున్నది. వేడిమి గల ఏడు సంవత్సరాలకుగాను - 1980 నుంచి - ఆరు సంవత్సరాలు నమోదు కాబడ్డాయి.

—[1992లో ప్రపంచ పరిస్థితి - ఎ వరల్డ్ వాచ్ ఇన్‌స్టిట్యూట్ నివేదిక ఆధారంగా]

## ఆలోచించండి



*సౌభాగ్యాన్ని - (సమృద్ధిని) శాంతి కలుగజేస్తుంది.*
*సమృద్ధి - గర్వాన్ని పుట్టిస్తుంది.*
*గర్వం - ద్వేషం కలిగిస్తుంది.*
*ద్వేషం - యుద్ధాన్ని పుట్టిస్తుంది.*
*యుద్ధం - దారిద్ర్యం కల్గిస్తుంది.*

---

"బాగా తయారై (ఉత్తమంగా, సంసిద్ధంగా) ఉన్నవారికి కూడా పరీక్షలు కఠినమైనవే - ఎందుకంటే తెలివిగల వ్యక్తి కూడా జవాబు

# తపాలాబిళ్ళలు - తెలుసుకోవలసిన వాస్తవాలు

సందేశం మోసుకుపోతున్న పనికి రుసుం చెల్లించబడిందనే ముద్రిత సూచనే - ఒక తపాలాబిళ్ళ అని చెప్పవచ్చు. 1840 మే 6 న గ్రేట్ బ్రిటన్‌కు చెందిన "పెన్నీ బ్లాక్" ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించింది. తపాలాబిళ్ళ తపాలా రుసుం చెల్లించేందుకు ఉద్దేశించ బడిందని శాశ్వతంగా నిర్ణయించబడింది.



అనంతరకాలంలోనే కొన్ని కారణాలు పెంపొంది తపాలా బిళ్ళల విడుదలకు సంబంధించిన ఏకైక ధ్యేయానికి కొన్ని గణనీయమైన మార్పులకు దారితీశాయి. ఈ జీవరహితంగా కనిపించే వస్తువులు హఠాత్తుగా గొప్ప ఆసక్తి కల్గించే అంశాలుగా మారి, కొందరు వ్యక్తులు ఊహాదృష్టిని ఆకర్షించాయి. ఈ విధంగా 19 వ శతాబ్ది మధ్య భాగంలో ఒక ప్రకటన "లండన్ టైమ్స్"లో ప్రత్యక్షమైంది. తన పడకగది గోడలను అలంక రించేందుకు అధిక పరిమాణంలో వాడిన పెన్నీ తపాలా బిళ్ళలను కొనేందుకు ఎంతో ఆసక్తితో ఉన్నానని ప్రకటన కర్త వ్రాశారు. మరో మహిళ తన లాంప్‌షేడ్‌ను అలంకరించేందుకు - ఉపయోగించిన తపాలాబిళ్ళలను సేకరించటంలో చాలా ఆసక్తిగా ఉన్నానని చెప్పింది. కానీ, ప్రధానంగా ఒక తపాలాబిళ్ళ ప్రాథమిక లక్ష్యం తపాలా వస్తువులకు రుసుం వసూలు చేయటమే అని చెప్పబడింది. ఈ సిద్ధాంతం ఇప్పటికీ అమలుచేయదగినదిగా ఉంది. తపాలా బిళ్ళల విడుదల, ఇతర తపాలా రేట్లు - నిర్వహణ వ్యయం సంపాదించేందుకే ప్రధానంగా ఉద్దేశింపబడ్డాయి. అమలులో ఉన్న "ముందుగా చెల్లించే రేట్ల"కు అనుగుణంగా చాలినంత వివిధ తపాలా (విలువగల) బిళ్ళలను విడుదల చేయటం జరుగుతున్నది.

సాధారణంగా విడుదల చేసే తపాలా బిళ్ళలలో రెండు విస్తృతమైన తరగతులకు చెందిన తపాలాబిళ్ళలు ఉన్నాయి. మొదటివి: ఆవశ్యకమైన తపాలాబిళ్ళలు లేదా వర్తమాన తపాలా బిళ్ళలు. ఇవి ప్రతి దినపు తపాలా ఉపయోగానికి నిర్దేశించబడ్డాయి. ఈ బిళ్ళలు నిరవధిక కాలానికి ఉపయోగించుకోవచ్చు. నిర్ణీత కాలానికి చెందిన తపాలా బిళ్ళల నమూనాలలో వివరాలు తక్కువగా ఉండి, ఎక్కువ మొత్తాలలో ముద్రించబడతాయి.

## వల్కనైజింగ్ విధానం కనుగొన్న గుడ్‌ఇయర్

*చార్లెస్ గుడ్‌ఇయర్ - రబ్బర్ ప్రయోగాలను సంవత్సరాల తరబడి కొనసాగించాడు. ఒకరోజున వరాకుగా ఉండి సల్ఫర్ మరియు రబ్బర్ మిశ్రమాన్ని ఒక వేడి కుంపటిపైన ఒలకబోశాడు. అతడు ఎదురు చూస్తున్న ఫలితాన్ని ఆకస్మికంగా అందుకో గలిగాడు. రబ్బర్‌ను సల్ఫర్‌తో మిశ్రమం చేసి వేడి చేసినట్లయితే, అది మార్పులకు లోనవుతుంది. దాని జిగటుదనాన్ని కోల్పోతుంది. అధికమైన బిగువు (వట్టు)ను, అత్యధికమైన వ్యాకోచ గుణాన్ని ఇచ్చే పూర్తి కొత్త లక్షణాలను కలుగజేస్తుంది. ఈ ప్రక్రియ "వల్కనైజింగ్" అని పేరొందింది.*

'ప్రార్థనలో - హృదయం లేని మాటలకన్నా మాటలు లేని హృదయం
— గాంధీజీ

ఈ బిళ్లలు సాధారణంగా సైజులో చిన్నవిగా ఉంటాయి. ప్రత్యేక సందర్భాలలో, లేదా స్మృతి, స్నాతకోత్సవ సందర్భాలలో విడుదలయ్యే ఇతర రకాల బిళ్ళల కంటే ఇవి సైజులో చిన్నవిగా ఉంటాయి. 1840లో గ్రేట్ బ్రిటన్‌లో విడుదలయిన ప్రసిద్ధి పొందిన "పెన్నీ బ్లాక్"నే తమ నిర్ణీత ప్రమాణంగా అనేక ఆవశ్యకమైన తపాలా బిళ్ళలు ఆమోదించటం జరిగింది. ఒక పెన్నీ బ్లాక్ తపాలా బిళ్ళ సైజు - 22 మి.మీ. x 18 మి.మీ. ఉంటుంది.




రెండవ తరగతికి చెందిన తపాలా బిళ్లలు - స్మృతి చిహ్నం లేదా ప్రత్యేక బిళ్ళలు - సాధారణంగా నిర్దేశిత కాలంలో మాత్రమే విడుదలవుతాయి. ఒక ప్రత్యేక సంఘటన కానీ, వార్షికోత్సవం కానీ జరిగిన సందర్భంలో వీటిని విడుదల చేస్తారు. ఇవి ఆవశ్యకమైన తపాలా బిళ్ళల వలే విలక్షణంగా ఉంటాయి. స్మారక తపాలా బిళ్ళలు నిర్ణీత తపాలా బిళ్ళల కంటే పెద్దవి. వీటి ప్రేరణలు కూడా అత్యంత ఆసక్తిదాయకంగా ఉంటాయి. వీటికి ఎంతో ప్రచార విలువ ఉన్నది. తపాలా బిళ్ళలకు ఎల్లలు లేవు. ప్రపంచంలోని మూరుమూల ప్రాంతాలకు కూడా చేరుకుంటాయి. మనకు తెలిసినంత వరకు ఈ రకమైన మొదటి తపాలా బిళ్ళను 1870 లో పెరూలో విడుదల చేశారు. రైల్వేల 20 వ వార్షికోత్సవ సందర్భంగా ఇది జరిగింది. ప్రత్యేక బిళ్ళలు సాధారణంగా ఒక ప్రత్యేక తేదీకి అనుబంధించబడి ఉంటాయి కనుక ఇవి వీలైనంతవరకు ఆ తేదీన కానీ, ఆ తేదీకి సమీపంలో కానీ విడుదల చేయబడాలి.

యునైటెడ్ స్టేట్స్‌లో స్మారక తపాలా బిళ్ళలు జాతిపై గాఢమైన, చిరస్థాయి గల ప్రభావం చూపిన వ్యక్తులు మరియు సంఘటనల గౌరవార్థం విడుదల చేస్తారు. అక్కడ దీన్ని ఎంతో ఘనతగా, గౌరవంగా భావిస్తారు. రాజకీయ లేదా సాంఘిక దురభిమానం గల సంస్థలు, వాణిజ్య సంస్థలు లేదా ఒక ప్రత్యేక వస్తువు - గౌరవార్థం స్మారక బిళ్ళలను విడుదల చేయరాదని ఆ ప్రభుత్వం శాసించింది.

ప్రత్యేక స్మారక తపాలా బిళ్ళలను విడుదల చేస్తున్న బెల్జియం తపాలా నిర్వాహక శాఖ జ్ఞానాభివృద్ధికి, ఉన్నతమైన అనుభూతులకు మరియు కళాత్మక విద్యకు సంబంధించిన ఇతివృత్తాలకు ప్రాధాన్యం ఇస్తున్నది. ఒక చారిత్రక సంఘటన, లేదా ఒక ప్రముఖ వ్యక్తి లేదా ఒక ప్రధాన ఉత్సవ సూచనగా, ఇతర కార్యకలాపాలకు అనువుగా తపాలాబిళ్ళలు విడుదల చేస్తున్నారు. సామాన్యంగా చెప్పా

## గాంధీజీ సమయస్ఫూర్తి

*మహాత్మాగాంధీ కదులుతున్న రైలుపెట్టె ద్వారం వద్ద నిలబడినప్పుడు ఆయన చెప్పులలో ఒకటి క్రింద పడిపోయింది. ఆయన వెంటనే రెండవ చెప్పును కూడా క్రిందికి త్రోసివేస్తూ ఇలా అన్నారు: "రైలు మార్గం పైన ఆ చెప్పు దొరికిన వ్యక్తి ఈ రెండో జత చెప్పు కూడా ఉపయోగించుకోవచ్చు."*

- జె. మారస్

"నీవు ఎంత తక్కువగా మాట్లాడితే, అంత ఎక్కువగా నీ మాటలు వింటారు."

లంటే ఎక్కువ పెద్దవి లేదా అసహజ పరిమాణం కలవి అయిన తపాలా బిళ్ళలను విడుదల చేయాలనే ప్రయత్నంగా ఇది ఉండకూడదు. తపాలాబిళ్ళ చాలా పెద్దదిగా ఉంటే, అది ఆ వస్తువు యొక్క అడ్రస్ భాగం అతిక్రమణపై జరుగుతున్నదే. ఇది కూడా తపాలాబిళ్ళకంటే తక్కువ ప్రాధాన్యం కలదేమీ కాదు.

విడుదలయిన తపాలా బిళ్ళలలో అత్యధిక భాగం - దీర్ఘ చతురస్రం, చదరం లేదా సమతలంగా ఉంటాయి. ప్రపంచంలోని అనేక ఇతర దేశాలు ఇతర పరిమాణాలలో - త్రిభుజం, గుండ్రం, అండాకారం, సమతలం, దీర్ఘ చతురస్రం, అష్టభుజి మొదలైనవి - తపాలా బిళ్ళలను విడుదల చేశాయి.

కొన్నాళ్ళ క్రితం ఒక దేశం తన సరిహద్దుల ఆకారంలో ఒక తపాలా బిళ్ళను విడుదల చేసింది. త్రిభుజాకారంలోని తపాలా బిళ్ళలు ప్రజాదరణకు పాత్రమయ్యేందుకు కారణం - వాటి అసాధారణ రూపం ప్రజలకు ఉత్సాహం కలిగించటం. 1853లో కేప్ ఆఫ్ గుడ్ హోప్ మొదటి త్రిభుజాకారపు తపాలా బిళ్ళను విడుదల చేసిందనే విషయం ఇక్కడ మననం చేసుకోవటం ఆసక్తి కలిగిస్తుంది.

"నిశ్చితమైనవి" - ప్రధానంగా నిర్వహణ వ్యయం భరించేందుకు ఉద్దేశించినవని సామాన్యాభిప్రాయంగా ఉన్నది. ఈ దృష్ట్యా ప్రత్యేక తపాలా బిళ్ళలు ద్వితీయ పాత్ర మాత్రమే నిర్వహిస్తాయి. అయితే స్మారకార్థం విడుదల చేసే బిళ్ళలు లేదా ప్రత్యేక బిళ్ళలు - తపాలా బిళ్ళల ప్రియులకు ఆకర్షణీయంగా ఉంటాయి. ఇక్కడే అత్యంత ఎక్కువ విచక్షణ పాటించబడి, జాగ్రత్త తీసుకోబడుతుంది. స్మారక బిళ్ళలు ఒక విధంగా - వాటిని విడుదల చేసే ప్రభుత్వం యొక్క చిత్తశుద్ధికి పరీక్షగా నిలుస్తాయి.

అంతర్జాతీయ తపాలా బిళ్ళల ఫెడరేషన్ ప్రధాన కార్యభారం, "అవాంఛనీయమైన" (లేదా) "నిందాపూరితమైన" తపాలా బిళ్ళల విడుదలకు వ్యతిరేకంగా పోరాటం జరపటమే. వివిధ దేశాలకు చెందిన తపాలా బిళ్ళల సంఘాల మధ్య అంతర్జాతీయ సంబంధాలను ఈ సంస్థ పరిశీలిస్తుంది.




## ఎల్లోరాలోని కైలాసనాథాలయం


Ellora caves

*ఇండియాలో బండరాళ్ళను కోసి నిర్మించి దేవాలయానికి ఉత్తమ ఉదాహరణ రాష్ట్ర కూటరాజు కృష్ణ 1 (756 - 773 ఏ.డి.) ఔరంగాబాద్ (మహారాష్ట్ర) సమీపంలో ఎల్లోరా నిర్మించిన కైలాసనాథాలయం. గర్భగుడి, స్తంభాలు ధ్వజస్తంభం, చిన్న ఆలయాలు, ముఖద్వారం మొదలైనవి - రాతిని తునకలుగా చేసి నిర్మించడ జరిగింది. ఈ దేవాలయం యావత్తూ రాతి నుండి మలచబడింది. ఇటుక నిర్మాణం వలెకాక, ప ఎగువనుండి ప్రారంభమై దిగువ పునాదికి చేరు తుంది. కనుక రవాణా సమస్య కాని, వరంగ సమస్య కాని తలెత్తదు. ఎల్లోరా ఆలయ "ప్రపంచ అద్భుతం" అని పిలువబడుతున్నది.*

"నీవు ఎన్ని వాదనల్లో (తర్కాలు) గెలిస్తే, అంత తక్కువ మంది స్నేహితులు మిగులుతారు."

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1. లోక్‌సభ స్పీకర్ ఎవరు?
(ఎ) రబీరాయ్, (బి) శివరాజ్ పాటిల్, (సి) బలరాం జాఖర్, (డి) మధులిమాయే.
ఢిల్లీ నుండి దౌలతాబాద్‌కు తన రాజధానిని మార్చిన భారత ముస్లిం పాలకుని పేరు?
(ఎ) ఘియసుద్దీన్ తుఘ్లక్, (బి) ఫిరోజ్ షా, (సి) సికందర్ లోడి, (డి) మహమ్మద్ - బిన్ - తుఘ్లక్.



3. సౌరమండల వ్యవస్థలోని ఈ క్రింది గ్రహాలలో ఉపగ్రహం లేని గ్రహం ఏది?
(ఎ) బృహస్పతి, (బి) శని, (సి) భూమి, (డి) బుధుడు.
అత్యల్పకాలమే భారత ప్రధాన మంత్రిగా పనిచేసిన వారెవరు?
(ఎ) వి.పి. సింగ్, (బి) చంద్రశేఖర్, (సి) చరణ్‌సింగ్, (డి) మొరార్జీ దేశాయ్.
భారత శాస్త్రీయ సంగీతానికి ఈ క్రింది వాటిల్లో మూలం ఏది?
(ఎ) శివ పురాణం, (బి) విష్ణు పురాణం, (సి) సామవేదం, (డి) అధర్వణ వేదం.
6. మానవ జీవుల్లో ఉమ్మినీటిగ్రంధులు దేనికి సంబంధించినవి:
(ఎ) జీర్ణక్రియ, (బి) శ్వాసక్రియ, (సి) నాడీ సంబంధి, (డి) వ్యాపనక్రియ.
7. ఆర్థిక లోటు విధానం:
(ఎ) విదేశాల నుంచి అప్పు తీసుకురావటం, ఆదాయానికి మించిపోవటం, (సి) కావలసిన దానికంటే తక్కువగా ఉండటం, (డి) విదేశీ సహాయం పొందటం.
నరసింహం కమిటి ఈ విషయంపై తన నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది:
(ఎ) ఆదాయం పన్ను వ్యవస్థ, (బి) బాంకింగ్, (సి) దిగుమతి మరియు ఎగుమతుల

## ఈజిప్ట్ పిరమిడ్లకంటే ప్రాచీనమైన రొట్టె

*ఈజిప్షియన్ పిరమిడ్ల కంటే రొట్టె ప్రాచీనమైనది. జ్యూరిచ్ (స్విట్జర్లాండ్) లోని మ్యూజియంలో ఉన్న రొట్టె - భూగర్భ శాస్త్రవేత్తల అభిప్రాయం ప్రకారం- 6000 ఏళ్ళ క్రితం రాతియుగంలో కాల్చబడింది. న్యూయార్క్ (యునైటెడ్ స్టేట్స్) లోని ఒక మ్యూజియంలో "తాజా" రొట్టె - 3,400 సంవత్సరాల నాటిది - ప్రదర్శించబడుతున్నది.*

— *"స్పుత్నిక్" సౌజన్యంతో*

## పురోగమనం!

*అభివృద్ధి (లేక) పురోగమనం - ఒక తిన్నని (వంపులేని) ఆరోహణరేఖ (గీత)ను అనుసరించదు. కానీ అది పరిణామక్రమం మరియు విఘటనం యొక్క ప్రగతి, తిరోగతి గల ఒక నుడి.*

— *గోథె*

"అవకాశం (ఘటన) మన తల్లిదండ్రుల్ని తయారుచేస్తుంది. కానీ ఎంపిక మన స్నేహితుల్ని తయారుచేస్తుంది."

పునర్వ్యవస్థీకరణ, (డి) ప్రభుత్వ రంగ నిర్వహణ సంస్థలలో నియామకాలను రాజకీయాలకు అతీతం చేయటం.

## మాటల మహిమ

1. కంచుకము: (ఎ) అవిక, (బి) కుబుసము, (సి) కవచము, (డి) పాము కుబుసము.
2. కంచుకి: (ఎ) అంతఃపురపు కావలివాడు, (బి) విటుడు, (సి) పాము, (డి) అగరుమ్రాను.
3. కంబువు: (ఎ) శంఖము, (బి) ఏనుగు, (సి) కడియము, (డి) నత్తగుల్ల.
4. కలధ్వని: (ఎ) అవ్యక్త మధుర ధ్వని, (బి) కోలము, (సి) నెమలి, (డి) పావురము.
5. కాలధర్మము: (ఎ) మరణము, (బి) చావు, (సి) కోడి, (డి) విల్లు.
6. కావేరి: (ఎ) ఒకానొక యేఱు, (బి) ఎఱుపు, (సి) పసుపు, (డి) వెలయాలు.
7. కింకిరాతము: (ఎ) గజ్జె, (బి) కోయిల, (సి) చిలుక, (డి) వన్నె చెట్టు.
8 కీర్తి: (ఎ) యశము, (బి) విరివి, (సి) తేట, (డి) అడుసు.

## తెలివికి పరీక్ష

1. ఏ.ఎల్.డి వ్యాధి ఎలా వస్తుంది? దీని లక్షణాలేమిటి?
2 ప్రపంచంలో కెల్లా అతి పెద్ద ద్వీపం ఏది?
3. విజయనగర రాజుల కులదైవం ఎవరు?
4. మంజీర - ఏ నదికి ఉపనది?
5. ఇరాక్, ఇరాన్, బంగ్లాదేశ్‌ల కరెన్సీ పేర్లేమిటి?
6. ఈ ఏడాది ఒక తెలుగు రచయిత, కవి, చిత్రకారుడు. సంగీతోపాసకుడు అయిన బహుముఖ ప్రజ్ఞావంతుని శతజయంతి జరుగుతున్నది. ఆయన ఎవరు?

(జవాబులకు వ పేజీ చూడండి)

## హితకరమైనవి



ఇతరులు తగాదాల్లో ఇరుక్కొని
కష్టాలు కొని తెచ్చుకున్నప్పుడు గ్రుడ్డిగా ఉండు.
ఇతరులు పుకార్లు వ్యాపింపచేస్తున్నప్పుడు మూగగా ఉండు.
ఇతరులు వ్యర్థ ప్రవచనాలు చేస్తున్నప్పుడు చెవిటిగా ఉండు.
అదృష్టాన్ని సాధించేందుకు ఇతరులు నిరీక్షిస్తున్నప్పుడు పని చేస్తూ ఉండు.
ఇతరులు పైకి లాగే వారి కోసం వేటాడుతున్నప్పుడు నీవు నెట్టుకు వెళ్ళు.
ఇతరులు కలహ ప్రియులుగా, వివాదాస్పదులుగా ఉన్నప్పుడు నీవు సహనబుద్ధితో ఉండు.
ఇతరులు తప్పులు చేసి పట్టుబడినప్పుడు నీవు ఉదారంగా ఉండు.

## మన దుఃఖాలకు మనమేకారణం

మనలో చాలామంది మన సొంత దుఃఖాన్ని ఉత్పత్తి చేసుకుంటాము. అయితే అన్ని దుఃఖాలకు మనమే కారణము కాదు. మన కష్టాల్లో కొన్నిటికి సాంఘిక పరిస్థితులు కూడా బాధ్యత వహిస్తాయి. అయితే యదార్థమేమిటంటే ఎక్కువ భాగం, మన ఆలోచనలు, వైఖరుల ద్వారా జీవితపు మిశ్రిత పదార్థాల్ని బట్టీపెట్టి సుఖమో, దుఃఖమో మనకు మనమే రూపొందించుకుంటాము.

— డా. నార్మన్ విన్సెంట్ పీలె

"మీకు అత్యంతం తోడ్పడే పుస్తకాలు ఏవంటే మిమ్మల్ని ఎక్కువగా ఆలోచింపజేసేవే." — థియొడోర్ పార్కర్

## పర్వతారోహకునకు ఆక్సిజ సిలండర్ ఎందుకు?

జీవించటానికి అవసరమైన ఊపిరి తీసుకునేందుకు మనకు చాలినంత ఆక్సిజన్ అవసరం. భూమికీ మేఘాలకూ మధ్య ఆక్సిజన్ స్వేచ్ఛగా ప్రసరిస్తూ ఉంటుంది. కనుక ప్రాణవాయువు ఇక్కడి భూములపైన, మైదానాలపైన పుష్కలంగా లభిస్తుంది. ఊపిరి పీల్చటం కూడా సులభంగా ఉంటుంది. కానీ మనం కొండ పైకి వెళ్ళినట్లయితే - ఉదాహరణకు 7000 అడుగుల ఎత్తుకు వెళ్ళినట్లయితే - ఊపిరి పీల్చుకోవటం చాలా కష్టమౌతుంది.



గాలి యొక్క తగ్గిన ఒత్తిడి - ఊపిరి తిత్తుల లోని రక్తానికి గాలినుండి బదిలీ అయ్యే ఆక్సిజన్ సామర్థ్యాన్ని తగ్గిస్తుంది. మనం శ్రమపడి గాలి పీల్చాలి. ఆక్సిజన్ మార్పిడి యొక్క తగ్గిన శక్తిని పూరించేందుకు గుండె త్వరితంగా కొట్టుకోవాలి.

మనం ఇంకా ఎత్తుకు వెళ్ళినట్లయితే మనకు చాలా అల్పమైన ఆక్సిజన్ మాత్రమే లభిస్తుంది. ఒక్కొక్కసారి, - అరుదుగానే - అసలు ప్రాణవాయువే లభించదు. అందువల్ల పర్వతారోహకులు అత్యధిక ఎత్తుగల కొండను ఎక్కేటప్పుడు, కావలసినంత ఆక్సిజన్ ఉన్న సిలండర్‌ను మోసుకుపోతుంటారు. వారు పీల్చినప్పుడు ఈ ఆక్సిజన్ గొట్టాల ద్వారా వారు ధరించిన ముసుగులోకి వెళ్ళి ముక్కు ద్వారా ఊపిరితిత్తులకు చేరుతుంది.

వీరు శ్వాసించినప్పుడు కావలసినంత మేరకే ఆక్సిజన్‌ను ఊపిరి తిత్తులకు పంపేటందుకు వీలుగా ఈ ఆక్సిజన్ సిలండర్‌ను క్రమబద్ధం చేసే కవాటాలు ఉంటాయి. ఎక్కువ ఎత్తుగల పర్వతాలపై దీర్ఘకాలం - శ్వాసించేందుకు, ఏ విధమైన కష్టం లేకుండా నివసించేందుకు సులభమౌతున్నది.

— ఉమేష్ జె.పి. నగర్

## ఔషధ ప్రపంచం

### రైజ్డ్ కృత్రిమ మధువాహిక

*మానవ మధువాహిక (Pancreas)ను అనుకరించే ఒక కంప్యూటరైజ్డ్ కృత్రిమ మధువాహికను బ్రిటిష్ డయాబిటిక్ అసోసియేషన్ తయారుచేసింది. ఒక మాదిరి సైజుకు తగ్గించబడిన ఈ యంత్రం మధుమేహ వ్యాధిగ్రస్తులకు (తొడిగి) ఉపయోగించవచ్చు. దీనివల్ల ప్రతిరోజు ఇన్‌జక్షన్స్ తీసుకునే అవసరం ఉండదు.*

"ఎక్కడైతే దాతృత్వం మరియు వివేకం ఉంటాయో, అక్కడ భయం కానీ, అజ్ఞానం కానీ ఉండవు."

— సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సీసి

# అగ్ని ప్రమాద నివారణకు కొన్ని చిట్కాలు

గృహంలో జరిగే విపత్తుల్లో అత్యధిక భాగం నిద్రించే సమయంలో - రాత్రి 10 గంటల నుంచి ఉదయం 6 గంటల మధ్య - జరుగుతాయి. మంటలు అతి దగ్గరకు రాక ముందే ఎన్నో చావులు సంభవిస్తున్నాయి.



ఆపదలకు గురైనవారు ఈ అపాయం గురించి తెలియనందువల్ల ఏ మాత్రం ఎరగని స్థితిలో ఉంటారు. వారు గాఢనిద్రలో మునిగి ఉన్నప్పుడు వారు పీల్చే విషవాయువులు నిశ్శబ్దంగా వారి ప్రాణాలను హరిస్తాయి. అయితే అనేక అగ్ని ప్రమాదాలు మానవుల పొరబాట్ల వల్ల జరిగేవి కనుక వీటిని అరికట్టవచ్చు. మిమ్మల్నీ, మీ కుటుంబాన్నీ రక్షించుకునేందుకు, అగ్ని ప్రమాదపు అత్యధిక స్థితిలో ఏవిధంగా సంసిద్ధం కావాలో తెలియజేసే కొన్ని చిట్కాలు అందిస్తున్నాము:

అగ్ని ప్రమాదం గురించి ఫిర్యాదు చేయటం:

గాభరా పడకుండా ఉండేందుకు ప్రయత్నించండి. ఎంత ప్రశాంతంగా మీరు ఉంటే, ఫైర్ డిపార్ట్‌మెంట్‌కు ఫిర్యాదు చేసేటప్పుడు, స్పష్టంగా మీరు ఆలోచన చేసేందుకు అది అతి సులభంగా ఉంటుంది.

1 ప్రతి ఒక్కరూ ఇంటి నుంచి వెలుపలికి వెళ్ళారని నిశ్చయం చేసుకోండి. ఎవరినీ ఇంట్లోకి తిరిగి ప్రవేశించనీయకండి. ఇరుగు పొరుగువారి ఇంటి నుంచి కానీ, దగ్గరలో ఉన్న టెలిఫోన్ నుంచి కానీ ఫోన్ చేయండి.

2. డిస్పాచర్‌కు మీ పేరు, చిరునామా స్పష్టంగా చెప్పండి.

3. మీరు మాట్లాడే ఫోన్ నెంబర్ ఇవ్వండి. తప్పులు దొర్లకుండా నెమ్మదిగా, స్పష్టంగా మాట్లాడటానికి ప్రయత్నించండి. అపార్థాలు ఆలస్యానికి దారి తీస్తాయి.

4 మీరు కావలసిన సమాచారమంతా ఇచ్చే వరకు లైన్‌లోనే ఉండి జవాబులివ్వండి.

5 ఫైర్‌బ్రిగేడ్ వచ్చినప్పుడు వారికి మార్గ దర్శకత్వం వహించేందుకు వీలుగా మీ కుటుంబ సభ్యుణ్ణో లేక పొరుగువారినో ప్రహరీ గోడ వద్ద నిలపండి.

తప్పించుకునే మార్గాలు: అగ్ని ప్రమాదం సంభవించినప్పుడు, మీరు మామూలుగా ఉపయోగించే నిష్క్రమణ ద్వారం ద్వారా తప్పించుకోవడానికి మొదట ప్రయత్నిస్తారు. మీకూ, మీ కుటుంబానికీ ఇది సులభంగా ఒక మృత్యుబోను కావచ్చు. కుటుంబం మొత్తాన్ని అప్రమత్తం చేయండి. మీరు మామూలుగా

## క్రికెట్‌లో ఆస్ట్రేలియాపై ఇంగ్లండ్ ప్రథమ విజయం

*1880 లో ఇంగ్లండ్ ఓవల్ క్రికెట్ మైదానంలో జరిగిన మొదటి టెస్ట్ మ్యాచ్‌లో ఇంగ్లండ్ ఆస్ట్రేలియాపై విజయం సాధించింది.*

"బిడ్డ తనతో కలహించినప్పటికీ తల్లి ఆ బిడ్డకు సేవ చేస్తుంది, ఈ సేవ చేస్తుండగా కూడా బిడ్డ పోట్లాడటం జరుగుతుంది."

— అమ్మ

ఉపయోగించే నిష్క్రమణ ద్వారం పొగతోకానీ, మంటలతో కానీ నిరోధింపబడితే ఉపయోగించేందుకు రెండు విభిన్న నిష్క్రమణ మార్గాలను ఏర్పాటు చేసుకోండి. త్రాళ్ళ నిచ్చెనలు అందుబాటులో పెట్టుకోవచ్చు. వృద్ధుల కోసం, వికలాంగుల కోసం ప్రత్యేక ఏర్పాట్లు చేసుకోవాలి. మీ ఇంటికి వెలుపల ఒక స్థలంలో కుటుంబమంతా కలుసుకునేటట్లు పథక నిర్మాణం చేసుకోండి. దీనివల్ల ప్రతి ఒక్కరూ భవనం వెలుపల ఉన్న విషయం తెలిసిపోతుంది. ఒకసారి భవనం నుండి బయట పడినట్లయితే, ఇక బయటే ఉండండి.

పొగను గుర్తించే పరికరాలు - మీ ప్రాణ రక్షకులు. మీ కుటుంబాన్ని అగ్ని ప్రమాదం నుంచి రక్షించుకునేందుకు మీరు పెట్టవలసిన అత్యంత ప్రధానమైన పెట్టుబడి ఇదే. "చూసే" లేదా "ముక్కుతో గాలి పీల్చే" ఈ ఎలక్ట్రానిక్ పరికరాలు మీ ఇంటిలోని గాలిని మానిటర్ చేసి మొదటి ప్రమాద సూచకపు అలారం మ్రోగిస్తాయి. దీనివల్ల హాని జరగకుండా గృహంలోనివారు బయట పడే అవకాశం కలుగుతుంది.

వస్త్రాలకు అగ్ని ప్రమాదం జరిగితే - మరణాలతో బాటు ప్రతి సంవత్సరం అది వేలాది మందిని గాయపు మచ్చలకు గురి చేస్తున్నది. వీలైనప్పుడల్లా బిడ్డల కోసం కొన్న వస్త్రాలు - ముఖ్యంగా నిద్రించేటప్పుడు వేసుకునేవి - అగ్ని నిరోధకాలుగా ఉండాలి. అగ్ని నిరోధక వస్త్రాలు వృద్ధులకు, వికలాంగులకు కూడా సిఫార్సు చేయబడ్డాయి. మీ వస్త్రాలు అగ్ని ప్రమాదానికి లోనైతే, ఇతరుల గుడ్డలకు నిప్పంటుకున్నప్పుడు మీరు రక్షించటం జరిగితే - ఈ మూడు మాటలు మర్చిపోవద్దు: స్టాప్ (ఆగు); డ్రాప్ (జారు లేక పడు); రోల్ (గుండ్రంగా దొర్లు).

1. స్టాప్! (ఆగు, నిలు): పరుగెత్తవద్దు. పరుగెత్తినందువల్ల అవి పంకావలే విసిరి - త్వరితంగా మంటల్ని ప్రజ్వలింపజేస్తాయి.
2. డ్రాప్ (జారు (లేక) పడు): మీ ముఖాన్ని చేతుల్తో కప్పుకోండి. వెంటనే నేల మీదికి జారిపోండి. తలకు మంట సోకకుండా జాగ్రత్త పడాలి. ఇది మీ శ్వాస క్రియనూ, ముఖాన్నీ, కళ్ళనూ రక్షిస్తుంది.
3. రోల్ (గుండ్రంగా దొర్లు): ఏది దొరికితే దాన్ని - బ్లాంకెట్, కోట్ లేదా రగ్ - లాక్కొని మంటల్ని అణచేందుకు దానిలో గుండ్రంగా చుట్టుకుపోండి. ఏదీ దొరకనప్పుడు మట్టి, గడ్డి, మొక్కలు మొదలైన వాటి ఉపరితలంపై దొర్లుతూ పొండి.

## ఒక తేనెపట్టులో 60,000 తేనెటీగలు!




*ఒక తేనెపట్టులో దాదాపు 60,000 తేనెటీగలు ఉండవచ్చు!*

## దక్షిణ భారతంలో ఎత్తైన శిఖరం

*దక్షిణ భారతదేశంలో ఎత్తైన శిఖరం -అనైముడి, (2695 మీటర్ల ఎత్తు).*

"మీకు ఉత్తమ సేవకులు ఉన్నట్లయితే మీరు ఉత్తమ యజమానులుగా కూడా ఉండేటట్లు చూసుకోండి." — రిచర్డ్ బాక్స్టర్

వీరు కలుసుకోవటం జరిగింది. మహారాజా సింధియా స్వంత నౌక "ఎస్. ఎస్. లాయల్టీ" విక్రయానికి వచ్చిందని వాట్సన్ చెప్పాడు. దీని ద్వారా ఒక భారతీయ నౌకా రవాణా సంస్థను స్థాపించాలని వాల్‌చంద్ భావించారు. బొంబాయి చేరగానే నేరుగా నౌకను చూసేందుకు రేవుకు వెళ్ళారు. నౌకను పరీక్షించి, ఆ తరువాత కొద్ది రోజుల్లోనే తన మిత్రుల సహాయాన్ని సమకూర్చుకుని $4^1/_2$ కోట్ల రూపాయల పెట్టుబడితో సింధియా స్టీమ్‌షిప్ నావిగేషన్ కంపెనీ లిమిటెడ్ స్థాపించారు.



బ్రిటిష్ నౌక యజమానుల నుండి ఈ షిప్పింగ్ కంపెనీకి వ్యతిరేకత వచ్చినా, అన్ని ప్రతిబంధకాలను అధిగమించి వీరు నిలబడ్డారు. విదేశీ స్వప్రయోజన పరులయొక్క, బ్రిటిష్ ప్రభుత్వం యొక్క ఉదాసీన, ఉపేక్ష వైఖరి వల్ల ఏర్పడిన తీవ్ర వ్యతిరేకతను కూడా వీరు అధిగమించగలిగారు. ఆఖరికి భారత నౌకా యాన చరిత్రలో భారత జాతీయ నౌకా పరిశ్రమకు న్యాయబద్ధమైన సముచిత స్థానం లభింపచేసే కృషిలో విజయం సాధించారు.

ఇదే విధంగా వాల్‌చంద్ స్వయంగా అనేక సంస్థలతో - ప్రీమియర్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ, ది ప్రీమియర్ ఆటోమొబైల్స్, రావల్‌గాన్ సుగర్ ఫార్మ్ లిమిటెడ్, అనుబంధం పెట్టుకుని - తన జీవిత పర్యంతం భారత వాణిజ్యా అభివృద్ధికి అకుంఠిత దీక్షతో తోడ్పాటు అందజేశారు. స్వభావరీత్యా సామాన్యంగా, నమ్రతతో ఉండేవారు. ఆయన తనదేశాన్ని - సైన్స్ మరియు టెక్నాలజీ దిశగా - నెమ్మదిగా, నిబ్బరంగా సాగే పారిశ్రామికీకరణ దిశగా నడిపించారు.

ఇండియాలో విస్తృతంగా పర్యటన జరిపిన వారిలో ఆయన ఒకరు. ఆయన బర్మా (మయన్మార్), సిలోన్ (శ్రీలంక), యూరప్ ఖండమంతా, అమెరికా, జపాన్ దేశాలలో పర్యటించారు. ఉత్తర ధ్రువప్రాంతం వరకు ప్రయాణం చేసి అర్ధరాత్రి సూర్యుణ్ణి సందర్శించారు. యూరప్‌లో అత్యంత ప్రసిద్ధి చెందిన వ్యక్తుల్ని కలుసుకుని వారితో పరిచయాలు పెంచుకున్నారు.

వ్యాపార అవకాశాల గురించి వాల్‌చంద్ సరైన అభిప్రాయాలు ఏర్పరుచుకుని శీఘ్రగతిలో వాటిని అమలు జరిపేవారు. దీనిలో అతనితో ఎవరూ పోటీ చేయలేరు. శాన్‌ఫ్రాన్సిస్కోలో మకాం చేసినపుడు చైనా ప్రభుత్వం ఆహ్వానంపై ఒక అమెరికన్ విమానయాన నిపుణుడు చైనా వెళ్తున్నాడని తెలుసుకున్నారు. జపాన్‌కు ఆ నిపుణునితో కలిసి ప్రయాణం చేసి, అతనిని పరిచయం చేసుకుని, ఆ నిపుణుడు ఇండియా సందర్శించేందుకు, ఒక ఎయిర్ క్రాఫ్ట్ ఫ్యాక్టరీ స్థాపించేందుకు తక్షణ ప్రయత్నాలు చేశారు.

ఆయన సాహస వ్యాపారాల అఖండ విజయానికి - ఆయన పూర్వాలోచన, లోతైన చూపు, సరైన నిర్ణయాలు కారణమౌతున్నాయి.

వాల్‌చంద్ 1963 లో కన్నుమూశారు.

"పగ, ద్వేషం ఎప్పుడైనా చంపవచ్చు కానీ ప్రేమ ఎన్నడూ చావదు."

# వింతైన ఊసరవెల్లులు

నీటా కాల్విన్

అనేక ఊసరవెల్లులు (తొండలు) - దాదాపు 90 జాతులు - మెడగాస్కర్ మరియు ఆఫ్రికాలలో నివసిస్తాయి. కేవలం ఒకే ఒక ఊసరవెల్లి ఇండియాలో కనిపిస్తుంది. దీన్ని ఇండియన్ ఊసరవెల్లి లేక హిందీలో 'సిర్‌గిట్' అని పిలుస్తారు. భారతదేశపు ఊసరవెల్లి -



పొడవైన బల్లి (అతిపెద్ద నమూనా - కొలతలో 375 మిల్లీ మీటర్ల పొడవు ఉంది) ఒక ప్రక్క భాగం నొక్కబడిన శరీరం కలిగి, ప్రబలంగా ఆకుపచ్చరంగుతో ఉంటుంది. దీని శరీరంపైన పసుపు పచ్చని మరియు నల్లని పట్టీలు మరియు చుక్కలు ఉంటాయి. అయినప్పటికీ, దీని శరీరపు రంగు మార్పు చెందుతుంటుంది; ఒక్కొక్కసారి ఇది ఒకే విధమైన పసుపు పచ్చని రంగు లేదా బూడిద రంగులో ఉంటుంది. ఉద్యానవనపు బల్లి వలే కాక, ఊసరవెల్లి సాధారణంగా కనిపించదు. రోజులో చాలాభాగం అది కదలకుండా నిల్చి ఉన్నా, చెట్టు పట్టా లేక ఆకుల రంగులో ఉన్నా దీన్ని ఎవరూ గమనించలేరు.

మఱుగుపడి ఉండేందుకు నిపుణత కలిగి ఉన్నా - ఊసరవెల్లి - తన నేపథ్యానికి అనువుగా నాటకీయంగా రంగులు మార్చే దాని సామర్థ్యాన్ని గురించి తరచు అతిశయోక్తిగా చెబుతారు. రంగులో వచ్చే తీవ్ర మార్పులు సహజంగానే కాంతి మరియు శీతోష్ణస్థితి తీవ్రత యొక్క మార్పులు మరియు జంతువు మనఃస్థితిలో మార్పుల ఫలితాలే.

పొందుగోరు సమయంలో లేదా పోరాడే సమయంలో ఊసరవెల్లి కాంతివంతమైన రంగులు ప్రదర్శించేందుకు సంసిద్ధంగా ఉంటుంది. అయితే అనారోగ్యవంతమైన ఊసరవెల్లి పాలిపోయి వివర్ణంగా ఉంటుంది. భారత ఊసరవెల్లి యొక్క రంగులు మార్చే సామర్థ్యం పసుపు పచ్చ మరియు ఆకుపచ్చ రంగులకే పరిమితమైంది.

ఊసరవెల్లి నాలుక మరియు కళ్ళు వింత ఆకర్షణ కలిగి ఉంటాయి. కళ్ళు పెద్దవిగా కనుపాపలు చర్మపు గుమ్మటం నుంచి ముందుకు త్రోసుకు వచ్చే విధంగా ఉంటాయి. ఒకదాని నుంచి వేరొకటి స్వతంత్రంగా ఇవి పని చేస్తాయి. ఒకేసారి రెండు విభిన్న మార్గాలలోకి ఊసరవెల్లి చూసేందుకు తోడ్పడతాయి. అన్ని మార్గాల వెంట చలించే కళ్ళు ఆహారం (ఎర) దొరకగానే ఏకమైపోయి ఆ జంతువు పైనే దృష్టిని కేంద్రీకరిస్తాయి.

ఒకసారి - ఎర - లక్ష్యంగా మారగానే ఇవి తమ నాలుకను వెలికి చాపి ప్రాకే జంతువుల వలెనే దాన్ని పట్టి వేస్తాయి. శరీరానికి 1 ½రెట్లు పొడవుగా వీటి నాలుక పెరిగిపోతుంది. నాలుక మొన (కొన) జిగురుగా, మరియు దట్టంగా

"ఒక మనిషికి నీవేమీ బోధించలేవు, తనలో ఉన్నదాన్ని శోధించేందుకు అతనికి సహాయపడగలవు." — గెలీలియో

ఉంటుంది. ఇది ఒక దుడ్డు కఱ్ఱను పోలి ఉంటుంది. బలి అయిన పశువు ఈ జిగురు మొనకు సమీపంలోకి రాగానే అది దానికి అంటుకుని పోతుంది. ఊసరవెల్లి తన నాలుక ద్వారా దాన్ని నోటిలోకి అతి త్వరితంగా చేర వేస్తుంది. ఊసరవెల్లులు తమ నాలుకల ద్వారా గాలిలోని సూక్ష్మజీవులను పట్టుకుని భుజిస్తాయి. మిడతలు, సూక్ష్మక్రిములు భయంకరమైన ఈగలు - దీనికి అభిమాన ఆహార పదార్థాలు.

వీటి తోకలు గ్రహణశక్తి కలిగినవి కనుక కొమ్మల మీద భద్రత కలిగి ఉంటాయి. అత్యంత సహాయం ఆవశ్యకమైనప్పుడు ఊసర వెల్లులు వీటిని కొమ్మల పైన చుట్టి మూసి వేస్తాయి. దీన్ని ఉపయోగించనప్పుడు తోకను తరచుగా ఒక బిగువైన వలయంలో చుట్టి ఉంచుతాయి. అనేక ఇతర బల్లులవలే తోక తెగిపోవటం కానీ, పునరుద్ధరణ జరగటం కానీ వీటికి ఉండదు.

ఊసరవెల్లులు స్వదేశపు జంతువులు. ఇవి ఒక నిర్ణీత పరిధిలోనే నివసిస్తాయి. తమ సొంతజాతుల నుంచే కాక ఇతర జాతుల నుంచి కూడా ఇవి తమ భూభాగాన్ని రక్షించుకుంటాయి. దురాక్రమణదారులైన ఊసరవెల్లులతో చేసే పోరాటాలు శారీరకమైన యుద్ధాలు కాక రంగుల పోటీ కోసం జరిగేవే ఎక్కువ. ఓడి పోయిన ప్రత్యర్థి తన ఓటమిని అంగీకరిస్తూ ఎవరూ గుర్తించని రంగుకు మారిపోతుంది. దీనితో పోరాటం సమాప్తమౌతుంది.

గ్రుడ్లు పెట్టే సమయం ఆసన్నమైనప్పుడు ఆడ ఊసరవెల్లి చెట్టు నుంచి క్రిందికి దిగుతుంది. భూమిలో ఒక రంధ్రం త్రవ్వుతుంది. ఇది దాదాపు దాని పొడవు ఉంటుంది. దానిలో 22 నుంచి 33 గ్రుడ్లు పెడుతుంది. అది ఆ రంధ్రాన్ని (బొరియ) పుల్లలు, గడ్డి , ఆకులతో మూసి వేస్తుంది. కొన్ని మాసాల తరువాత చిన్నారి ఊసరవెల్లులు వాకిలి తలుపు తెరుచుకుని భూమిపైకి వస్తాయి.

— 'సిఇఇ - ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

# స్టాంపుల కథ

## ఆకుపచ్చ చారల గోదురుకప్ప




*ఆకుపచ్చ చారలున్న గోదురుకప్ప స్వీడన్‌లోనూ, యూరోపు ఖండంలోని ఇతర ప్రాంతాలలోనూ కనిపిస్తుంది. హిమాలయాలపైన 4,700 మీటర్ల ఎత్తున కూడా ఇది కనిపిస్తుంది. అత్యధిక చలికాలాలు కూడా దీన్ని బాధించవు. గోదురుకప్ప రంగు సాధారణంగా పాలిపోయిన · (వివర్ణమైన) పచ్చరంగు లేదా బూడిద మరియు గాఢమైన పచ్చరంగులో ఉంటుంది. దీనికి ఎరుపు లేక నారింజ చారలు ఉంటాయి. ఒక పర్యావరణం నుంచి మరో చోటికి మారేటప్పుడు ఇది తన రంగును త్వరితంగా మార్చుకుంటుంది. ఈ రకపు గోదురు కప్ప నమూనా 1979 లో జారీ చేయబడిన ఒక స్వీడిష్ తపాలా బిళ్ళపై కనిపిస్తుంది.*

— *కబితా రాయ్*

'పఠనం - సంపూర్ణ మానవుణ్ణిగా రూపొందిస్తుంది. వ్రాత - ఒక ఖచ్చితమైన మనిషిని, సంభాషణం (ఉపన్యసించటం) - ఒక సంసిద్ధుడైన మనిషిని రూపొందిస్తుంది." — ఫ్రాన్సిస్ బేకన్

# సరసోక్తులు

## దంతవైద్యుడు

నోటివరకు రెక్కాడిస్తూ డొక్క నింపుకునే వ్యక్తి దంత వైద్యుడు. ఒక మహిళను నోరు తెరవమనీ, నోరు ముయ్యమనీ ఉత్తర్వు చేయగల ధైర్యవంతుడైన ఏకైక వ్యక్తి అతడే - పైగా ఆమె దగ్గర డబ్బు కూడా దండుకుంటాడు. మీ నోట్లో లోహం పెట్టి మీ జేబులో నుంచి నాణేన్ని బయటికి లాగే మాంత్రికుడూ అతడే!



## ఆదర్శ జీవితం

మన జీవితం వెలుపలి దృక్కోణంలో సామాన్యమైనదిగా, లోపల భాగ్యవంతమైనదిగా ఉండాలి. మన నాగరికత ఆర్థిక దోపిడి మరియు సంఘర్షణల ద్వారాకాక సాంఘిక సహకారం ప్రాతిపదికగా దృఢమైన పునాదులపై నిలబడుగాక! — రవీంద్రనాథ్ టాగోర్

## స్త్రీ పురుషులు

తనకు భర్త లభించేదాకా స్త్రీ భవిష్యత్తు గురించి ఆందోళనపడితే, తనకు భార్య లభించేదాకా పురుషుడు ఎంతమాత్రం భవిష్యత్తు గురించి ఆందోళన పడడు.

## రెండు పనులు!

అతిథి సెలవు తీసుకునేటప్పుడు నెరవేర్చ వలసిన రెండు ముఖ్య విధులు ఉన్నాయని నేను ఎప్పుడూ భావించుకుంటాను. ఒకటి:

# అవార్డులు

## ఒరియా కవికి సరస్వతీ సమ్మాన్ అవార్డ్

*సుప్రసిద్ధ ఒరియా కవి, రచయిత రమాకాంత రథ్‌కు 1993 సరస్వతీ సమ్మాన్ పురస్కారం లభించింది. ఆధునిక ఔచిత్యం ద్వారా రాధా కృష్ణుల అమరగాథను "శ్రీరాధ" అనే ప్రామాణిక కావ్యంగా రచించినందువల్ల ఈ బహుమతి లభించింది.*

## 73 - 49 బిసి నాటి కాగితం

*73 మరియు 49 బిసి మధ్య నాటి మూడు కాగితపు ముక్కలను చైనా పురావస్తు శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. తూర్పు హాన్ వంశీయులకు చెందిన కాయ్ లున్ 105 ఏ.డి.లో కాగితాన్ని కనుగొన్నట్లు ఇంతకు పూర్వం వెల్లడించబడింది. బైజింగ్ యూనివర్శిటీకి చెందిన నిపుణులు పరిశోధన శాలా పరీక్షలు నిర్వహించి ఈ కాగితం సిల్క్‌కు బదులు జనపనారతో తయారైనదనీ, పూర్వం కనుగొనబడిన హాన్ వంశీయుల కాగితం కంటే దీని నేత మృదువుగా ఉన్నదనీ నిరూపించారు*

## ఎకనమిక్స్‌లో మొదటి నోబెల్ బహుమతి గ్రహీతలు

*రాగ్నర్ ఫ్రిస్ (నార్వే) మరియు జాన్ టిన్ బెర్జిన్ (నెదర్లాండ్స్) ఎకనమిక్స్‌లో మొదటి నోబెల్ బహుమతి విజేతలు.*

**"అతి అల్పమైన పనిలోనైనా, నిర్దిష్టత (పరిపూర్ణత) - లక్ష్యం కావాలి."**

తన వస్తువు దేనినీ అతడు మర్చిపోకుండా చూడటం. రెండవది: నాకు సంబంధించిన ఏ వస్తువునైనా అతడు తీసుకుపోకుండా చూడటం.

— ఆల్‌ఫ్రెడ్ నార్త్ వైట్‌హెడ్

## రాజనీతి!

రాజనీతి (దౌత్యతంత్రం) అంటే నాజూకు మార్గంలో అసహ్యాకరమైన విషయాన్ని చెప్పటం.

— ఐజక్ గోల్డ్‌బెర్గ్

## రాజకీయవేత్త

తన తెరచిన నోటికి ఏ విషయాన్నైనా అందుబాటులోకి తెచ్చుకునే వాడే రాజకీయ నాయకుడు.

## కురూపస్త్రీలు!

కురూపులైన స్త్రీలు లేరు. సొగసుగా కనిపించటమెలాగో తెలియని స్త్రీలు మాత్రమే ఉన్నారు.

## అకౌంటెంట్!

నీవు సంపాదించిన డబ్బు నీవు సంపాదించలేదని విశదపర్చేందుకు కిరాయికి తెచ్చుకున్న వ్యక్తే అకౌంటెంట్.

## స్నాతకోత్సవం

విద్యార్థులు ఆకాంక్షతో (అభిలషిస్తూ) ప్రవేశించి, స్వేదం (చెమట)తో వెలికి వచ్చే స్థలమే - స్నాతకోత్సవం!

## వాదనకు శ్రోతలు

ఇరువైపుల వారి వాదనలనూ వినే ఏకైక జనులు - ఇరుగుపొరుగువారు.

*తన దగ్గర అదనంగా ఉన్న బైబిల్ గ్రంథాన్ని జార్జి బెర్నార్డ్ షా అమ్మగా చూసిన ఆయన పరిచయస్థులొకరు చాలా గాబరాపడుతూ అది చాలా అనుచితమైన పని అని, బైబిల్‌ని అమ్మినవారికి నరకం ప్రాప్తిస్తుందని హెచ్చరించారు.*

*అందుకు షా నవ్వుతూ 'ఈ మాట నా ముందు అంటే అన్నారు కానీ, ఏ పుస్తక విక్రేత ముందైనా అనేరునుమా, ఆ తరువాత ఆదేవుడే మిమ్మల్ని రక్షించాలి' అన్నాడు.*

* * *

*గొప్ప తత్త్వవేత్త అయిన సోక్రటీస్ ముందు ఒకసారి ఆయన శిష్యుడొకడు 'బహుశ మా వంశంలో జన్మించినంత గొప్పవాళ్ళు మీవంశంలో జన్మించి ఉండరేమో' అన్నాడు.*

*'నిజమేనయ్యా! మీ వంశం గొప్పదనం నీతో ఆఖరైతే నావంశం గొప్పదనం నాతో మొదలైంది' అన్నాడు సోక్రటీసు.*

*— భవాని*

*— 'జగతి' సౌజన్యంతో*

## తప్పులు తుడిచే పెన్సిల్‌తో కొత్త ఫౌంటెన్ పెన్

*స్కూలు పుస్తకాలలో గందరగోళ పర్చే సిరా గురుతులకు స్వస్తి చెబుతూ బెర్లిన్ హెర్‌లిట్జ్ కంపెనీ ఒక కొత్త ఫౌంటెన్‌పెన్ సమర్పిస్తున్నది. ఒక చివర గోల్డ్‌ప్లేట్ వేసిన పాళీ, మరో చివర ఎరేజర్ పెన్సిల్ (తుడిచివేసే పెన్సిల్) ఉంటాయి. ఒక వ్యాసం వ్రాసేటప్పుడు పొరపాటు జరిగినట్లయితే ఈ ఎరేజర్‌తో ఏమాత్రం జాడలేకుండా దాన్ని తొలగించుకోవచ్చు. సాధారణ పద్ధతిలోనే పెన్ ఉపయోగించి ఆ పొరపాటు మాట / వాక్యం పైనే వ్రాసుకోవచ్చు. ఈ ఫౌంటెన్ పెన్ "టొర్నాడో ఎస్ఎల్ఎస్" అని పిలువబడుతున్నది.*

---

"నీవు కొంతమందిని ఎల్లవేళలా మోసగించవచ్చు మరియు అందరినీ కొంతకాలం మోసగించవచ్చు. కానీ నీవు అందరినీ ఎల్లకాలం మోసగించలేవు."

కిరా బిచ్‌కోవా

మన శరీరపు బరువులో నీరు మూడులో రెండు వంతుల వరకు ఉంటుంది. దప్పిక కావటమనేది ఒక అత్యంత ప్రధానమైన శరీర సంకేతం. అంగక్రమ నిర్మాణం పూర్తిగా ఎండి పోతున్నదనీ, దీనికి మరింత ద్రవ పదార్థం అవసరమనీ ఈ సంకేతం.




నీరు చాలా సామాన్యమైనదిగా, పరిచయమైనదిగా కనిపించినా, నిజానికి అదొక నిగూఢ వస్తువు. దానికి రంగు లేదు, వాసన లేదు, రుచి లేదు, ఆకారం లేదు. కానీ చివరి అంశం యదార్థం కాదు. ఎందుకంటే నీటికి ఒక ఆకృతి ఉన్నది. రోదసి నుండి జరిగిన ఒక ప్రత్యక్ష ప్రసారంలో ఒక వ్యోమగామి బాటిల్ మూత తీసి, నీటిని విడిలించటం జరిగింది. అదొక స్పష్టమైన, గడగడ వణికే బంతి వలే వెలుపలికి వచ్చింది. జీరో భూమ్యాకర్షణ శక్తి (గురుత్వం)లో నీరు పొందే ఆకారం ఇది. అయినప్పటికీ, వాన చినుకులు పడటం గురించి నీవు ఆలోచిస్తే, అవి కూడా బంతి వంటి ఆకారంతోనే ఉంటాయి.

నీటికి అనేక గణనీయమైన లక్షణాలు ఉన్నాయి. ఇది ఉప్పు, చక్కెర, అనేక ఇతర ఘనపదార్థాలను కరిగిస్తుంది. వీటిల్లో దేనినైనా కరిగించిన తరువాత నీరు పరిశుద్ధంగానే ఉంటుంది, కానీ భారంగా మారుతుంది. అయినప్పటికీ నీరు ఘనీభవించి గట్టిపడినపుడు, బరువు తేలిక అవుతుంది. అందువల్లనే మంచుగడ్డ - నదులు, సరస్సులు, సముద్రాల పైన - తేలుతుంది. నీటిలో మునిగిపోదు.

నీరు దిగువకు ప్రవహించటమేగాక పైకి కూడా వెళుతుంది. అయితే గొట్టాలు పలుచగా ఉండాలి. వెంట్రుకవాసిలో ఉండే ఈ మృదువైన గొట్టాలు కేశనాళికలు (కాపిల్లరీస్) అని పిలువ బడతాయి. ఇవి వృక్షాలలోనూ, మొక్కల లోనూ కనిపిస్తాయి. వీటి పని - నీటిని, ఇతర ఆవశ్యకమైన వస్తువులను వ్రేళ్ళనుండి ఆకులకు సరఫరా చేయటం.

## వ్యాపార అవకాశం

*ఒక పాదరక్షల కంపెనీ సేల్స్‌మన్ సుదూర గ్రామానికి ఆర్డర్లు సేకరించేందుకు వెళ్ళాడు. ఒక రోజు అక్కడ గడిపిన తరువాత వైర్ ఇచ్చాడు: "ఇక్కడ ఎవరూ పాదరక్షలు ధరించరు. ఆర్డర్లు వచ్చే ఆశ లేదు. రేపే తిరిగి వస్తున్నాను."*

*మరో సేల్స్‌మన్‌ను అదే చోటికి పంపారు. అతడు ఇలా వైర్ ఇచ్చాడు: "ఇక్కడ ఎవరూ పాదరక్షలు ధరించరు. మన వ్యాపారానికి విస్తృతావకాశం ఉంది. అతి శీఘ్రంగా 800 జతల పాదరక్షలు పంపండి."*

*ఆపాదరక్షల కంపెనీ మొదటి సేల్స్‌మన్‌ను ఉద్యోగం నుంచి తీసివేసింది. రెండో సేల్స్‌మన్‌కు ప్రమోషన్ ఇచ్చింది.*

"నీవొక యోగ్యుడైన మనిషిని చూసినట్లయితే అతనితో పడేందుకు ప్రయత్నించు; నీవొక అయోగ్యుణ్ణి చూస్తే నీ అంతరాత్మను పరీక్షించుకో."

వర్షం కురవటం పూర్తయిన తరువాత తడిసిన చెట్లు, గడ్డి మొక్కలు, త్వరితంగా ఎండిపోతాయి. ఈ విధానాన్ని "ఆవిరైపోవటం" అంటారు. అంటే అర్థం: నీరు "నీటి ఆవిరి" అని పిలవబడే అదృశ్యవాయువుగా మారిపోవటం. గాలిలో ఎత్తుగా ఉండి ఆవిరి పొగమంచుగా రూపొంది మిలియన్ల కొద్ది నీటి బిందువులను ఉత్పత్తి చేస్తుంది. క్రిందనున్న మనం ఈ పొగ మంచును మేఘాలుగా చూస్తాము. ఏదో ఒక దశలో, ఈ మేఘాలు నీటిని వర్షంగా క్రిందికి పంపుతాయి.

భూమి ఉపరితలంపైన అత్యధికంగా నీరు ఉన్నది. సముద్రాలలోనూ, మహా సాగరాలలోనూ ఇది ప్రోగు పడుతున్నది. అయితే ఈ నీరు ఉప్పగా ఉంటుంది. ప్రజలు ఉపయోగించలేరు. ప్రజలకు కొత్త నీరు (తాజానీరు) కావాలి. ఇది ప్రకృతిలో సామాన్యంగా ఉండదు. అత్యున్నత పర్వతాగ్రాలలోని హిమనదులు మినహా - త్రాగే నీరు అత్యంత అరుదైనది. భూమి నీటిలోని ప్రతి పది బకెట్ల నీటిలో కేవలం ఒక గ్లాసెడు నీరు మాత్రమే త్రాగేందుకు పనికి వస్తుంది.

బురద మరియు సూక్ష్మజీవుల నుండి పరిశుభ్రపర్చినట్టి నదీజలాలను కొన్ని దేశాల ప్రజలు ఉపయోగిస్తారు. ఇతర దేశాలలో లోతైన బావులను త్రవ్వకుని భూగర్భజలాలను తోడుకుంటారు. సాగర తీరంలో ఉన్న దేశాలలో మంచుగడ్డలను ద్రవీభవింపచేసి త్రాగే నీటిని తయారు చేసుకుంటారు. అంటార్కిటిక్ ఖండంలోని కొన్ని ప్రదేశాలనుండి ఈ మంచు గడ్డలను దూర ప్రాంతాలకు ఈడ్చుకు పోతుంటారు.

—"మిషా" సౌజన్యంతో

## ఆణిముత్యాలు



* *దొంగతనం కంటే మరొకటి తెలియని వారు విచక్షణ కోల్పోయి చెడ్డపనులు చేస్తారు. తక్షణమే నశించిపోతారు*
* *వాసన చూడగానే 'అనిచ్చా' పుష్పం కాంతి హీన మౌతుంది. ఒక అక్కరలేని ముఖం చూడగానే అతిథి యొక్క ముఖం వివర్ణ మౌతుంది.*
* *ఏ విధమైన మినహాయింపు లేకుండా ప్రతి అంశం గురించి ఒక వ్యక్తి బాగా ఆలోచన చేసినట్లయితే, ఒక అనుకూల స్థితి నుంచి అమలు చేసినట్లయితే అతనికి మిత్రుడెవరూ అవసరం లేదు -- భయరాహిత్యం తప్ప.*
* *అపరిమిత ఆత్మతృప్తి వల్ల ఏర్పడిన మెలకువ లేమి - అధికమైన క్రోధం కంటే మిక్కిలి చెడ్డది.*
* *మనిషి యొక్క సోమరితనంలో, దురదృష్టం పొంచి ఉంటుందని, సోమరితనాన్ని శూన్యం చేసే మనిషి యొక్క పట్టుదల (అభినివేశం)లో మంచి అదృష్టం నివాసం ఉంటుందని విజ్ఞులు చెబుతారు.*

*— తిరువళ్ళువర్*

"ప్రతిదేశం తనకు తగినట్టి ప్రభుత్వాన్ని ఏర్పర్చుకుంటుంది."

డి మైస్ట్రి

# దిగ్భ్రమ కల్గించే వేడినీటి ఊటలు

నటాలియా వ్లాడిమిరోవా

అగ్నిపర్వతాల (జ్వాలాముఖి) సమీపాన అవి చురుకుగా పని చేస్తున్నా లేక అప్పుడే మసిపోయినా - దిగ్భ్రమ కల్గించే నీటి ఊటలు ఉంటాయి. ఇవి నీళ్ళు మరిగే వేడిలో ఉంటాయి. వీటినే మనం వేడినీటి ఊటలని అంటాము. ఈ వేడి నీరు - ఇళ్ళకు,



వ్యవసాయ క్షేత్రాలకు, ఈత కొలనులకు మరియు గ్రీన్‌హౌస్‌లకు (మొక్కలు పెరిగే అద్దాల భవనాలు) - గొట్టాల ద్వారా సరఫరా చేయబడు తుంది. ఐస్‌లాండ్ (ఉత్తర అట్లాంటిక్ సముద్రం)లో ఆర్కిటిక్ సర్కిల్ వాకిలి మెట్లపైనున్న ఊట సంవత్సరంలో ఏకాలంలోనైనా - వేడినీటి ఊటతో - తమ గ్రీన్‌హౌస్‌లను వెచ్చబరచటం జరుగుతున్నందువల్ల ఇక్కడి ప్రజలు తాజా పువ్వులు, ఆపిల్స్, ద్రాక్షలు, నారింజలు, అరటిపండ్లు పొందుతారు. సహజ సిద్ధంగా వేడినీటి ఊటలు ఏర్పడే ప్రదేశాల్లోనే రష్యా మరియు ఇతర దేశాలవారు తమ జియోథర్మల్ పవర్ స్టేషన్లను స్థాపించుకున్నారు.

వేడినీటి ఊటలు ఎలా ఏర్పడతాయి? భూమియొక్క గుల్ల క్రింద చాలా లోతులో కరిగిన సూదంటు రాతి పదార్థాలు నీటిని పొంగే స్థితి వరకు కాగబెట్టి వాటిని ప్రవాహంగా మారుస్తాయి. సలసల కాగిన నీరు భూమి పగుళ్ళను బ్రద్దలు కొట్టి వెలికి వచ్చి, ఒక్కొక్క సారి గణనీయమైన ఎత్తుకు ఎగసి పడుతుంది.

ప్రపంచంలో అత్యంత శక్తివంతమైన వేడినీటి ఊట - న్యూజిలాండ్‌లోని - వైమవ్‌కులో ఉన్నది. ఒక్కసారి 400 మీటర్ల ఎత్తుకు పైగా ఇది దాదాపు 800 టన్నుల నీటిని వెళ్ళగ్రక్కు తుందని ప్రసిద్ధి చెందింది. దాదాపు 1904 ప్రాంతాలలో ఇది చల్లారి (నశించి) పోయింది.

ఐస్‌లాండ్‌కు చెందిన గంతులు వేస్తూ దుమికే వేడినీటి ఊట - గైర్‌లా - ప్రతి రెండు గంటలకు 15 మీటర్ల మేరకు ఎగబ్రాకి పోతుంది. అత్యధిక వేడి నీటి ఊటలు - వాటికి సొంతమైన లయతో - కూడి ఉంటాయి. కంచట్కా ద్వీపకల్పం (సైబీరియా)లోని 100 వేడినీటి ఊటలలో ఒకదానికి 'క్లాక్' (గడియారం) అనే పరిహాసపు మారుపేరు కూడా ఉన్నది. ఇది ప్రతి నాలుగు నిమిషాలకు నిద్రనుండి మేల్కొంటుంది. యుఎస్ఏలోని ఎల్లోస్టోన్ నేషనల్ పార్కులో ఉన్న పురాతనమైన, విశ్వాస పాత్రురాలైన వేడినీటి ఊట గంట కొకసారి దెబ్బ తీస్తుంది. ఐస్‌లాండ్‌లోని పెద్ద వేడి నీటి ఊట రోజుకొక పర్యాయం వెలుపలికి తన్నుకొస్తుంది - కానీ మూడు గంటలపాటు పూర్తిగా నిల్చి ఉంటుంది.

—'మిషా' సౌజన్యంతో

"రాతి విగ్రహాల్లో మనం దేవుణ్ణి చూడగలిగితే, సజీవ ప్రాణుల్లో కూడా అతణ్ణి చూడగల్గుతాము."

# ప్రపంచంలో ప్రసిద్ధ శాకాహారులు

ఆర్.ఎన్. లఖోటియా

యునైటెడ్ స్టేట్స్, యునైటెడ్ కింగ్డమ్, జపాన్ మొదలైన ప్రపంచలోని పురోగామి దేశాలకు చెందిన అనేకానేకమంది వ్యక్తులు - ఒక జీవిత మార్గంగా - శాకాహారంవైపు మొగ్గుతున్నారు. ఈ దేశాలలో అన్ని రంగాలకు చెందిన ప్రముఖ వ్యక్తులు శాకాహారం ఆరోగ్య జీవన మార్గమని విశ్వసించటం ప్రారంభించారు.



ప్రపంచంలోని అత్యంత ప్రఖ్యాత తత్త్వవేత్తలలో కొందరు శాకాహారులే. వీరిలో - అరిస్టాటిల్, సోక్రటిస్, ప్లేటో, రుస్సియేవ్ - ఉన్నారు. అంతర్జాతీయ ప్రఖ్యాతి పొందిన తత్త్వవేత్త, మాజీ భారత రాష్ట్రపతి అయిన డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్ కూడా శాకాహారే.

ఎన్నిక ద్వారా శాకాహారాన్ని అవలంబించిన ప్రపంచ ప్రసిద్ధి పొందిన ఉత్తమ సాహిత్యకారుల సమూహం మన చెంత ఉన్నది. వీరు: విలియం షేక్స్పియర్, మిల్టన్, అలెగ్జాండర్ పోప్, షెల్లీ, లాంగ్ఫెలో, వర్డ్స్వర్త్, లియో టాల్స్టాయ్, హెచ్.జి.వెల్స్, వోల్టేర్, థోరో మరియు జార్జి బెర్నార్డ్ షా. భారతదేశానికి చెందిన విశ్వవిఖ్యాత నోబెల్ బహుమతి గ్రహీత రవీంద్రనాథ్ టాగోర్ కూడా శాకాహారే.

శాకాహారులైన ప్రపంచ గణనీయ శాస్త్రజ్ఞులలో కొందరు: న్యూటన్, పైథాగరస్, బెంజిమిన్ ఫ్రాంక్లిన్, ఛార్లెస్ డార్విన్, డాక్టర్ ఆల్బర్ట్ స్కివెట్జర్, డాక్టర్ హక్స్లే మరియు ఐన్స్టైన్. ఇండియాకు చెందిన విశ్వవిఖ్యాత నోబెల్ బహుమతి గ్రహీత డాక్టర్ సి.వి. రామన్ కూడా శాకాహారే.

పాప్ సంగీతంలో అంతర్జాతీయ ఖ్యాతి గాంచిన మైకేల్ జాక్సన్ మరియు మడొన్నా కూడా - వీరి వ్యక్తిగత నిర్ణయం ప్రకారం- శాకాహారులుగా ఉన్నారు. కనుక ఆధునికత మరియు ఫ్యాషన్ అనే భావనకు శాకాహార ఉద్యమం ఎంత మాత్రం వ్యతిరేకం కాదు.

## ఆసియాలో విజృంభిస్తున్న ఎయిడ్స్

*రక్తప్రవాహంలో విస్తృతంగా వ్యాపించి లైంగిక సంబంధాలు లేదా కలుషితమైన హైపోడెర్మిక్ సూదుల ద్వారా వచ్చే ఎయిడ్స్ శరీరంలోని ఇమ్యూన్ విధానాన్ని ధ్వంసం చేసి రోగగ్రస్థుల్ని చంపివేస్తుంది. ఎయిడ్స్ వ్యాధి - దక్షిణ మరియు ఆగ్నేయ ఆసియాలో త్వరితంగా వ్యాపిస్తున్నది. దీనికి కారణం ఈ ఖండంలోని 500 మిలియన్ల వయోజనుల జనాభా. (ప్రపంచ ఆరోగ్య సంస్థ అభిప్రాయం ప్రకారం)*

— *"హ్యూమన్ రైట్స్ వరల్డ్వైడ్" సౌజన్యంతో*

"మనం విడిచిపెట్టిన ప్రతి బాధ్యత మనం తెలుసుకోదగిన ఏదో ఒక సత్యాన్ని మరుగుపరుస్తుంది."

పుష్టికరమైన ఆహారం మరియు మంచి ఆరోగ్యం అనే దృష్టి నుంచి చూసినా శాకాహారపు ఆధిక్యతను శాస్త్రీయ పరిశోధనలు ఋజువు చేశాయి. కాన్సర్, గుండెపోటు మొదలైన ప్రాణాంతకమైన వ్యాధుల దాడికి తక్కువ అనువుగా శాకాహారం ఉంటుంది. ప్రపంచ ప్రసిద్ధి చెందిన మల్లయోధుడు - గామా - శాకాహారి. ప్రపంచంలోని ప్రఖ్యాత మల్ల యోధులు మాష్టర్ చండ్గీరాం మరియు గురు హనుమాన్ శాకాహారులే. ఒలింపిక్స్‌లో ప్రపంచ రికార్డు స్థాపించిన స్టాన్ ప్రైస్, ప్రపంచంలో అధికదూరం నడిచేవారిలో ప్రథముడు ఆర్. స్వీట్‌గాల్, దూరపు నడకలో 20 ప్రపంచ రికార్డుని గడించిన పావో నుర్మీ - వీరందరూ శాకాహారులే. మిస్టర్ ఇంటర్నేషనల్ బాడీ బిల్డింగ్ ఛాంపియన్ ఆండ్రూస్ ఛిలింగ్, డౌన్‌హిల్ - సహనశీల - స్కయింగ్‌లో ప్రపంచ రికార్డ్ స్థాపించిన పిర్‌కో వెర్‌నాట్ శాకాహారులే. కరాటే రంగంలో ఎనిమిది జాతీయ కరాటే ఛాంపియన్ షిప్పులను సాధించిన అబెలీ - శాకాహారే. టెస్ట్ క్రికెటీర్లు - విజయ్ మర్చంట్ మరియు వినోద్ మంకడ్ - ఇద్దరూ శాకాహారులే.

భారతదేశంలో మహాత్ములైన, శ్రీకృష్ణుడు, మహావీరుడు, బుద్ధుడు, తిరువళ్ళువర్ మరియు రుషులైన కబీర్, తులసీదాస్, సూరదాస్, మీరాబాయి, రామకృష్ణ పరమహంస, స్వామీ వివేకానంద మరియు రమణ మహర్షి - శాకాహారులే. అత్యంత ప్రముఖ నాయకులైన మహాత్మాగాంధీ, డాక్టర్ అనిబిసెంట్, డాక్టర్ రాజేంద్రప్రసాద్, సర్దార్ పటేల్, లాల్‌బహదూర్ శాస్త్రి, రాజాజీ మరియు లాలాలజపతిరాయ్ - వీరంతా శాకాహారులే.

— "మీరా" సౌజన్యంతో



తాత్పర్య రచన: యామిజాల పద్మనాభస్వామి

*పుత్రోత్సాహము తండ్రికి*
*పుత్రుడు జన్మించినపుడె పుట్టదు; జనులా*
*పుత్రుని గనుగొని పొగడగ*
*పుత్రోత్సాహంబు నాడు పొందుర; సుమతీ!*

*[కొడుకు పుట్టాడనగా విని తండ్రి సంతోషించడం సహజమే. కాని అంతమాత్రాన పొంగిపోవటం తగదు. ఆ కొడుకు పెరిగి పెద్దవాడై నలుగురిలో మంచివాడనిపించుకుంటే అప్పుడు తండ్రి ఆనందించాలి. కొడుకును పసితనం నుంచి క్రమశిక్షణతో పెంచుతూ, నీతినియమాలు బోధిస్తూ తండ్రి తీర్చిదిద్దాలి.]*

* * *

*బలవంతుడ నాకేమని*
*పలువురతో నిగ్రహించి పలుకుట మేలా*
*బలవంతమైన సర్పము*
*చలిచీమల చేతచిక్కి చావదె సుమతీ!*

*[తన శరీరం బలంగలదై ఉందని విర్రవీగుతూ, నన్నెవడేమి చెయ్యగలడని నలుగురిలో మిడిసిపడుతూ మాట్లాడడం తగదు. ఎప్పుడో ఒకనాడు నలుగురూ అదునూ, పదునూ చూసి కాళ్ళూ చేతులూ విరిచికట్టి పడగొట్టుతారు. పాము ఎంత బలం కలదైనా చలిచీమలు గుమిగూడి పట్టి గడియలో కళ్ళుమూసినట్టు చేస్తాయి. [కేవలం శరీర బలమే కాదు ధనం కూడా నిండుగా ఉండవచ్చు. కానీ ధనవంతుడనని కూడా ఎదుటివాళ్ళని చులకన చేసి మాటాడకూడదు.]*

"ఓడిపోయినవారు చెయ్యటానికి ఇష్టపడని పనులను చేసే అలవాటును విజేతలు పెంపొందించుకుంటారు."

# బలవర్ధక ఔషధాలు ఉచితం

చార్లెస్ న్యూటన్

మంచి ఆరోగ్యంగా ఉండటంలో జటిల మైనదేదీ లేదు. మనం త్రాగగలిగినంత ఎక్కువ నీరు, ద్రవ పదార్థాలు తీసుకోవాలి. ఈ విధంగా తీసుకున్నందువల్ల మనకు మనమే అంతర్గతంగా శుభ్రం చేసుకుంటున్నాము.




మనం ప్రతిరోజు స్నానం చేసి తీరాలి. దీని ఫలితంగా మన చర్మంలోని సూక్ష్మ రంధ్రాలను పరిశుభ్రం చేసుకుంటున్నాము. బాహ్యంగా కూడా మనం శుభ్రంగా కనిపిస్తాము. పుష్కల మైన సూర్యకాంతిలో మనం సక్రమంగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కొనసాగించటం ద్వారా తాజా గాలిలోని ఆనందం అనుభవించాలి.

మరొక సామాన్యమైనదీ, కానీ ప్రధానమైనదీ, అవసరమైనదీ - నిద్ర. అది అరిగిపోయిన జీవకణాలను మరమ్మతు చేసి, గతించిన శక్తిని తిరిగి సమకూరుస్తుంది. ఆలస్యంగా నిద్రించటం - యుగపు శాపం

చింత - మన ఆరోగ్యానికి అత్యంత నాశనకారి. రేపన్నది అసలు వస్తుందో, రాదో మనలో ఎవరికీ తెలియదు. మన ముందున్న నేటిని గురించి జాగ్రత్త వహించటం మంచిది. అంతే కాక, చింతవల్ల ఓ ఒక్క సమస్యా పరిష్కారం కాదు. దీనికి భిన్నంగా అది ప్రతి సమస్యను పరిష్కరించరాని ఒక గందరగోళంగా మార్చి వేస్తుంది. మన తోటి మానవులకు - మనలోని గొప్ప ఉత్సాహం, సజీవమైన హాస్యధోరణి - మనల్ని మరింత భరించగలిగేటట్లు చేస్తాయి. కానీ మంచి ఆరోగ్యంతో ఉండటం కూడా అవసరం.

మంచి ఆరోగ్యానికి ప్రధానంగా కావలసినది - వ్యాయామం. ఏ పద్ధతి ఆమోద యోగ్యమైనప్పటికీ, క్రమబద్ధమైన వ్యాయామం అత్యంత ఆవశ్యకం. మనం ఒక కష్టతరమైన క్రీడ ఆడకపోయినప్పటికీ కనీసం చురుకుగా నడవటం - అయినా చేయాలి. అన్ని వ్యాయామాల్లో నడక ఒక్కటే సులభమైంది, ఖర్చులేనిది. అయినా ఈ విషయంలో కూడా మనం ఎంత తక్కువ వ్యాయామం చేస్తున్నామో తెలిస్తే నిరుత్సాహం కల్గుతుంది. కొన్ని గజాల దూరానికి కూడా ఏదో ఒక వాహనం అధిరోహించేందుకు మనం సిద్ధమౌతున్నాము.

## విటమిన్ చిట్కాలు

*విటమిన్ బి 1 మధుమేహ వ్యాధిగ్రస్తులకు అత్యంత ఆవశ్యకమైనది. ఇది లేకుండా కార్బోహైడ్రేట్లు ఉపయోగపడవు. మూత్రపిండాలు లేదా మూత్రాశయాల్లో రాళ్ళు ఉన్న వ్యక్తులకు విటమిన్ డి ఇవ్వటం నిలిపివేసి, విటమిన్ ఏ ఇవ్వండి. విటమిన్ సి సహాయంతో ఇనుమును తనలో గ్రహించుకుంటుంది. విటమిన్ బి వృద్ధాప్యంలో టానిక్‌గా ఎంతో తోడ్పడుతుంది, (ఇది నిమ్మతొక్కలో లభిస్తుంది) కనురెప్పలలో ఉబ్బు కనిపిస్తే ప్రొటీన్ లోపం గురించి ఆలోచించండి.*

"మానవ జీవితం ప్రతిచోటా ఓర్పుతో సహించవలసిన స్థితిలోనే ఉన్నది, సుఖించే స్థితి అల్పంగానే ఉన్నది."

శామ్యూల్ జాన్సన్

మరో అజాగ్రత్త గల అలవాటు - మన దంత వైద్యపు బిల్లులు పెరగటానికి సాధారణ మైన అనారోగ్యం కలగటానికి - కారణమైనది - భోజనానంతరం మన నోటిని శుభ్రపర్చుకోక పోవటం. సమయం రీత్యా శ్రమరీత్యా ఇది ఏమీ కష్టమైనది కాదు. ఆర్థికంగా అసలు ఖర్చయేది ఏమీ ఉండదు. అయినా మన సోమరితనంవల్ల మనం అధిక మూల్యం చెల్లించవలసి వస్తుంది.

మనం మన తిండి విషయంలో స్వల్ప జాగ్రత్త తీసుకున్నట్లయితే, మనం వివేకంగల వాళ్ళం, సుఖజీవులం కాగలము. కొద్దిగా తినటం కంటే అధికంగా తినటంవల్లనే ఎక్కువగా హాని జరుగుతుంది కాయగూర లతో వండిన పదార్థాలు అత్యధిక అర్హత కలిగి ఉంటాయి. ఇవి తేలికగా జీర్ణ మవటమే కాక విరేచన గుణాలు కూడా కలిగి ఉంటాయి. అధిక మూల్యంగల విటమిన్సు, ఖనిజ సారాలు దీనిలో ఉంటాయి. ఇవి తాజాగా ఉన్నది లేనిదీ సులభంగా తెలుసుకోవచ్చు. ఇవి శరీర క్రమాన్ని చల్లబరుస్తాయి కనుక ఉష్ణమండల వాతావరణంలో ఆదర్శమైనవి. ఇదికాక శాకాహార భోజనం దీర్ఘాయువు కలిగిస్తుంది.

ఈ ఆధునిక కాలంలో సామాన్యంగా అభివృద్ధి చెందుతున్న జబ్బు - బలహీన మైన కంటి చూపు. కళ్ళద్దాలు కంటి చూపును అభివృద్ధి చేయలేవు. మనం చూసేందుకు మాత్రమే అవి తోడ్పడుతాయి. ప్రతి ఉదయం, ప్రతి రాత్రి నిద్రకు ఉపక్ర మించేందుకు ముందు కళ్ళను నీటితో శుభ్రం చేసుకున్నట్లయితే దృష్టి అభివృద్ధి చెందుతుంది. ఒక బేసిన్ నీటిలో - వీలైతే వేడి నీటిలో - ముఖాన్ని ముంచి, గాఢ నిశ్వాసం వదలి, వీలైనంత సేపు కళ్ళను తెరచి ఉంచాలి. దుమ్ము మరియు ఇతర మలిన వస్తువుల వల్ల ఇసుక కణాలు, రాళ్ళు కంటిపైన ఒక సన్నని పొరను ఏర్పరుస్తాయి. ఆ పొర ఈ నీటిలో కొట్టుకు పోతుంది. బలహీనమైన కంటి చూపుకు రోజ్‌వాటర్ మరియు తామర పువ్వుల తేనె - శ్రేష్ఠమైన ప్రతిక్రియలుగా పనికి వస్తాయి.

—"హర్యానా రెవ్యూ" సౌజన్యంతో

# ప్రపంచంలోని అతి పురాతన పురుగు



COCKROACH

*బొద్దింక - ప్రపంచంలోని అన్ని కీటకాలలో కెల్లా అతి పురాతనమైనదిగా పరిగణింపబడింది.*

# పోరాట పటిమ పెంచే అడ్డంకులు

*మనశ్శక్తి (సంకల్పం) చేత విజయం పొందేందుకు చైతన్యవంతం చేయబడే మానవునికి పోరాడే సమర్థతను పెంపొందించేవి తప్పనిసరిగా అడ్డంకులు మాత్రమే. పరిస్థితులు కఠినంగా, బాధాకరంగా మారినప్పుడే అతడు బాగా పనిచేయ గలుగుతాడు - అతని అభివృద్ధి మార్గం మృదువుగా ఉన్నప్పటి కంటే.*

— ఎఫ్.సి. రాబర్ట్స్

"భూమిపైనున్న గదికి మనం కట్టే అద్దె - సేవ.'

# 2050 నాటికి ప్రపంచ జనాభా రెట్టింపు కానున్నదా?

వర్తమాన అంచనాలను బట్టి ప్రపంచ వ్యాప్తంగా నిమిషానికి 176 జననాలు జరుగుతున్నట్లు తెలుస్తున్నది.

ప్రస్తుత ప్రపంచ జనాభా 5.48 బిలియన్ (1992 మధ్యకాలం) నుండి 2050 నాటికి 10 బిలియన్‌కు - రెండింతలుగా జనాభా పెరగగలదని ఐక్యరాజ్య సమితి జనాభా నిధి అంచనా వేసింది.

గర్భధారణ చేయగల (సారవంతమైన) వయస్సు గ్రూప్ (15 నుంచి 44 సంవత్సరాలు)లోని 300 మిలియన్ వివాహిత మహిళలు తాము కుటుంబ నియంత్రణ జరుపుకునేందుకు సిద్ధమౌతున్నా, వారు గర్భనిరోధక సాధనాలలో ఆధునిక విధానాలకు చేరువలో లేరు.

గర్భనిరోధక సాధనాలకు సంబంధించిన సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులో లేకుండా చేయటం వల్ల మహిళలు మరియు శిశువుల ఆరోగ్యంపైన దాని ప్రభావం పడుతున్నది. ప్రతిరోజు 40,000 శిశువులు మరణిస్తున్నారు. వర్ధమాన దేశాలలో ప్రతి ఐదు శిశు మరణాలలో ఒక మరణాన్ని నివారించవచ్చు - ప్రతి పుట్టుకకు మధ్య కనీసం రెండు సంవత్సరాల వ్యవధి ఇచ్చినట్లయితే దీన్ని నివారించవచ్చు.

ప్రసూతి వ్యాధుల వల్ల ప్రతి సంవత్సరం అర్ధమిలియన్ స్త్రీలు చనిపోతున్నారు. గర్భధారణకు సంబంధించిన కారణాల వల్ల వచ్చే (మరణాల) ఆపదలు ఒక్కొక్క దేశానికి వేరుగా ఉంటాయి. ఆఫ్రికాలో 25 మందికి ఒకరు, ఆసియాలో 38 మందికి ఒకరు, లాటిన్ అమెరికాలో 90 మందికి ఒకరు, తూర్పు ఆసియాలో 870 మందికి ఒకరు, వర్ధమాన దేశాలలో 1,750 మందికి ఒకరు మృతి చెందుతున్నారు.

— "టైమ్స్ ఆఫ్ ఇండియా" సౌజన్యంతో

## వాగ్ధాటి గల వక్త



*అందమైన, అనమానమైన కొద్దిమాటలను పలికేవాడే ఒక వాగ్ధాటి గల వక్త. అల్ప ప్రాధాన్యం గల అనేక శబ్దాలను ఉపయోగించేవాడు - ఒక వదరుబోతు!*

## నమ్మలేని నిజాలు!

### మృత్యుంజయుడు

*న్యూయార్క్‌లోని ఎంపైర్ స్టేట్ భవనంలోని 86వ అంతస్తు నుంచి ఒక పేద పెయింటర్ ఆత్మహత్య చేసుకునేందుకు క్రిందికి దుమకటం జరిగింది. కానీ గంటకు 80 కి.మీ.ల వేగంతో సాగుతున్న ప్రచండ వాయువు అతణ్ణి 85వ అంతస్తులోకి త్రోసివేసింది. అతడు గోడకున్న బీరువా మాదిరి సాధనానికి గుచ్చుబడ్డాడు. మళ్ళీ జీవితాశ చిగురించగా తన మనసు మార్చుకుని కిటికీ నుంచి బయటికి చూశాడు. తన కార్యాలయంలోకి నడిచాడు. అక్కడ పనిచేస్తున్న వారంతా దిగ్భ్రమతో అతని వైపు చూశారు.*

"కార్య నిర్వహణే నీ కర్తవ్యం, ఫలితం నీకు సంబంధించినది కాదు."

— భగవద్గీత



ప్రియమైనది, హాని కలిగించనిది అయిన ఆస్ట్రేలియాకు చెందిన - చాంపియన్ త్రవ్వే జంతువు - ఊంబట్ దాదాపు 36 కి.గ్రా.ల బరువు ఉంటుంది. ఇది బాగా పెరిగినప్పుడు 100 నుండి 106 సెం.మీ.ల పొడవు ఉంటుంది. ఇదొక కండపుష్టి గల గోధుమ వర్ణపు ప్రాణి. చూడటానికి ఒక రాక్షసాకారం




గల తోకలేని ఎలుక వలే ఉంటుంది, ఒక ఎలుగు గొడ్డు వలే ఉంటుంది. ఒక పంది వలే కనిపిస్తుంది. ఒక నీటి కుక్క అని కూడా పిలవబడుతుంది. దీని తల తుపాకీ గుండు ఆకారంలో ఉంటుంది. ఇది చిన్న గుండ్రని కళ్ళు, వెడల్పాటి ముక్కు మరియు వంపు లేని చెవులు కలిగి ఉంటుంది.

ఈ జంతువుకు శక్తివంతమైన పాఱల వంటి వాడి అయిన వంకర గోళ్ళు ఉంటాయి. వీటితో ఒక మనిషి ఎత్తు కన్నం (బొరియ) నిమిషాలలో త్రవ్వ గలుగుతుంది. అడవుల్లో ఈ జంతువులు "జీవించు, ఇతరులను జీవించ నివ్వు" అనే విధానం అవలంబించి - ముఖ్యంగా ఋతుకాలంలో - సామూహికమైన స్నేహబుద్ధిని ప్రదర్శిస్తుంటాయి. ఆడ ఊంబట్ తొలచిన సొరంగం చివర ఒక మండపం (గది) నిర్మిస్తుంది. కొద్దికాలం గర్భధారణ సమయం పూర్తి కాగానే, ఒక వేరుసెనగ పరిమాణం గల బిడ్డకు జన్మనిస్తుంది. ఈ చిన్నారి తల్లి గర్భం నుంచి మెల్లగా ప్రాకి వస్తుంది. వెంట్రుకలతో కూడిన ఉదరం నుండి ప్రయాణం చేసి తోలు సంచీ (pouch) వద్దకు నేరుగా చేరుతుంది.




## చేతి తొడుగులతో జరిగిన దీర్ఘపోరాటం

*1893 ఏప్రిల్ 6, 7ల్లో న్యూ ఆర్లియన్స్ (యుఎస్ఎ)లో ఆండీ బొవెన్ మరియు జాక్ బర్క్‌ల మధ్య చేతి తొడుగులు ధరించి చేసిన సుదీర్ఘమైన ముష్టి యుద్ధం జరిగినట్లు నమోదు చేయబడింది. ఈ పోరు 110 రౌండ్లుగా7 గంటల 19 నిమిషాలు సాగింది.*

## నీటిలోపల అడ్డంగా ఇంగ్లీష్ ఛానల్ ఈదిన మొదటి వ్యక్తి

*నీటిలోపల అడ్డంగా ఇంగ్లీష్ ఛానల్‌ను ఈదిన మొదటి ఈతగాడు 38 సంవత్సరాల వయస్సు గల ఫ్రెడ్ బాల్డసర్ (యుఎస్ఎ). 1962 జూలై 10న అతడు ఫ్రాన్స్ - ఇంగ్లండ్ మధ్య దూరాన్ని 18 గంటలలో పూర్తి చేశాడు.*

## ఒలింపిక్స్‌లో మొదటిసారి దూరశ్రవణ విధానం

*1924లో పారిస్ (ఫ్రాన్స్)లో జరిగిన ఒలింపిక్స్‌లో మొదటిసారి దూరశ్రవణ యంత్ర విధానాన్ని ప్రవేశపెట్టారు.*

"నీవు పాత తప్పిదాన్నే కొత్త పరిభాషలో పునరుచ్చరిస్తే మాత్రం వాసవలబ్ధి ఉండదు."

ఈ తోలు సంచీలో ఈ చిన్నారి జీవి ఒకటి రెండు చనుమొనలకు బంధించబడి ఆరు నెలల వరకు ఉంటుంది. $2\frac{1}{2}$ సంవత్సరాల వరకు ఈ జీవులు పూర్తిగా పరిపక్వం కావు. తర్వాత తోలుతిత్తిని వదిలి 30, 37 సంవత్సరాల వరకు జీవిస్తాయి.

ఈ జంతువు ఒక సొరంగాన్ని తొలుస్తుంది. ఒక కొండలో వంద అడుగుల వరకు తొలిచి మళ్ళీ వెలుపలికి వస్తుంది. రెండుసార్లు ఉమ్మి వేస్తుంది. మళ్ళీ పని మొదలుపెట్టి రెండింతలు వెడల్పుగా గోడలను పటిష్టం చేస్తుంది.

చిన్న ఊంబట్స్ వింతైన మచ్చిక జంతువులుగా రూపొందాయి. పొదల్లోని పచ్చికకు (తమ ఫలాహారంగా) ప్రాధాన్యం ఇస్తాయి. దీన్ని చిఱుచీకటి పడిన తరువాత తింటాయి. అర్ధరాత్రి భోజనంలో మరింత (గడ్డి) పచ్చిక, వేకువ సమయంలో మరింత పచ్చిక స్వీకరిస్తాయి.

దురదృష్టవశాత్తూ, ఊంబట్ గోధుమను పచ్చికగా ఎంతో ఇష్టపడుతుంది. గోధుమ పంటను దీని నుండి కాపాడేందుకు ప్రపంచ వ్యాప్తంగా ఏ కంచె కూడా పనికి రావటం లేదు. అధిక ఉపద్రవంగా తయారైనప్పుడు గోధుమ రైతులు దీన్ని నశింపచేస్తున్నారు. ప్రస్తుతం ఆస్ట్రేలియా ప్రభుత్వం ఊంబట్స్‌ను రక్షిత జంతువులుగా ప్రకటించి, వీటి కోసం కొన్ని భూములను ప్రత్యేకించింది కూడా.

## తేమవల్ల 0.68 శాతం ఆహార ధాన్యాలకు నష్టం

*ఇండియాలో కీటకాలు, ఎలుకలు, పక్షులు, గద్దలు, శిలీంద్రాలు మరియు తేమవల్ల దాదాపు 10 శాతం ఆహార ధాన్యాలు నష్టమౌతున్నాయి. తేమవల్లనే 0.68 శాతం నష్టం జరుగుతున్నది.*

## దినదినాభివృద్ధి చెందుతున్న లేజర్ నేత్ర చికిత్స

*కంటికి లేజర్ శస్త్ర చికిత్స ఎంత త్వరితంగా అభివృద్ధి చెందుతున్నదంటే, మరో పది సంవత్సరాలలో 45 ఏళ్ళకు తక్కువ వయస్సులో ఉన్నవారు కళ్ళద్దాలు కానీ, కాంటాక్ట్ లెన్సెస్‌కానీ ధరించనక్కరలేదు.*

*ఇది లండన్‌లోని యునైటెడ్ మెడికల్ అండ్ డెంటల్ స్కూల్‌లోని పరిశోధకుల విశ్వాసం. 'యాస్టిగ్మాటిజం' అని పిలువబడుతున్న ఒక పరిస్థితికి, ఇక్కడ లేజర్లను ఉపయోగించటం ద్వారా హ్రస్వదృష్టికి చికిత్స చేస్తున్నారు. ప్రస్తుతం దూర దృష్టికి, కంటి అంచుల చుట్టూ వికృతమైన దృష్టితో బాధపడేవారికి కూడా ఈ చికిత్సను పొడిగించారు.*

*హ్రస్వదృష్టి (మయోపియో)ని లేజర్ సర్జరీతో సరిచేయటంలో శస్త్ర వైద్యులు 95 శాతం విజయం సాధించారు. దూరదృష్టి (హైపర్ మెట్రోపియా)కి కూడా చికిత్స చేయగలమనే పూర్తి నమ్మకంతో ఉన్నారు. "యాస్టిగ్మాటిజం" సరి చేసేందుకు పురోగమించిన లేజర్ సాంకేతిక పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేస్తున్నారు. ఇది అత్యంత అభివృద్ధికి రాదగిన చికిత్సగా చెప్పబడుతున్నది.*

*దాదాపు 1/2 మిల్లీమీటరు దళసరిగా ఉండే కంటి మొదటి ఉపరితలం నుంచి గరిష్ఠ ప్రమాణంగా 40/1000 మిల్లీమీటర్ల ఖచ్చితమైన టిష్యూ (కణ జాలం)ను తొలగించటం ద్వారా లేజర్లు కంటి గ్రుడ్డును తిరిగి తీర్చిదిద్దుతాయి. లేజర్ నాడీ స్పందనకు 1/1009 ఎం.ఎం.లోని నాలుగో భాగం ఖచ్చితంగా ఉండగలదు.*

*— "ది ట్రిబ్యూన్" సౌజన్యంతో*

## స్వల్ప సంభాషణ

*రాం: ఏ నెలలో జనం తక్కువగా మాట్లాడుకుంటారు?*

*శ్యాం: ఫిబ్రవరి నెలలో. అది పొట్టి నెల కావటమే దీనికి కారణం.*

"క్రియాశీలం కాని ఆలోచన గర్భస్రావం, ఆలోచనలేని పని మూఢత్వం."



## [illegible]-21వ [illegible]

చార్లెస్ హెచ్. హెూల్బ్రో

అంతరిక్షం నుండి తీసుకువచ్చిన పటాలు, నివేదిక వల్ల భూమి యొక్క పరిమితుల గురించిన మన అభిప్రాయం అభివృద్ధి చెందుతున్నది. భూమి హద్దుల గురించి



స్పష్టంగా వెల్లడించిన అదే అంతరిక్షం యావత్ మానవాళికి ఆశాభావం అందజేస్తున్నది. వెలుపలి అంతరిక్షం ఎడతెగని అభివృద్ధికి అందమైన బాట వేస్తున్నది. భూమినుండి చేరేందుకు కఠినమైనది, శీతలమైనది, వాయురహితమైనది అయిన అంతరిక్షం ఇంధనానికి, ముడి పదార్థాలకు సారవంతమైనది. భూమిపైకి తెచ్చినప్పుడు ఈ ముడి పదార్థాలు మరియు ఇంధనం భూమి యొక్క సంతానాన్ని పోషించేందుకు తోడ్పడి, వారికి అభ్యుదయాన్ని చేకూరుస్తాయి.

రాక్వెల్ ఇంటర్నేషనల్ నియమించిన జర్మన్ దేశీయుడైన ఒక వైమానిక ఇంజనీర్ క్రాఫ్ట్ ఎహ్రిచ్ అంతరిక్షంలోని ఉత్పత్తి అయ్యే విద్యుచ్ఛక్తి భూమిని ప్రకాశింపజేయాలని పిలుపు ఇచ్చాడు. భారరహిత స్థితి మరియు అంతరిక్షంలోని శూన్యతను ఉపయోగించుకునేందుకు ఫ్యాక్టరీలు, స్పేస్ స్టేషన్ల నగరాల నిర్మాణం జరగాలని యన వాదిస్తున్నాడు. అక్కడ ఉన్న విస్తారమైన లోహాలను, ఖనిజాలను త్రవ్వి, శుద్ధి చేయటం ద్వారా చంద్రమండలంలో పరిశ్రమలు నెలకొల్పదలచాడు. అంగారకునికి కొంత దూరంలో సూర్యగ్రహ సంచార మార్గంలో ఉన్న దాదాపు స్వచ్ఛమైన నికిల్ - ఇనుము నక్షత్ర సమూహాలను స్వలాభానికి వినియోగించుకోవాలని సూచిస్తున్నాడు. ఈ పదార్థాల రాశులలో ఒకటి - వ్యాసంలో ఒక కిలో మీటర్ లేదా రెండు కిలో మీటర్లు కలది - అసాధారణమైన, స్వచ్ఛమైన ఇనుప ఖనిజాన్ని భూమిలోని పరిశ్రమలన్నిటికీ 20 సంవత్సరాల పైగా సరిపోయేటంత మేరకు సరఫరా చేయగల స్థితిలో ఉన్నది.

ప్రపంచ ప్రసిద్ధి చెందిన మేనేజ్మెంట్ మరియు రిసెర్చి కన్సల్టెంట్స్కు చెందిన ఆర్థర్ డి. లిటిల్ ఇన్ కార్పొరేటెడ్ - ఇంజనీరింగ్ సైన్సెస్ అధినేత డాక్టర్ పీటర్ - ఇ - గ్లేసర్ సౌరశక్తి అంతరిక్షంలో ఏ విధంగా బంధించబడి, విద్యుచ్ఛక్తిగా సులభంగా -

## కాంక్రీట్లోని నీటిబిగువు నిర్ణయించే పరికరం

*మాస్కో (రష్యా) లోని ఆల్ - యూనియన్ ఆర్ అండ్ డి ఇన్స్టిట్యూట్ ఆఫ్ ట్రాన్స్పోర్ట్ కన్స్ట్రక్షన్లోని పరిశోధకులు కాంక్రీట్లోని నీటి బిగువును, గాలి వ్యాపించే స్థితిని త్వరితంగా నిర్ణయించు ఒక సులభమైన, నమ్మదగిన పరికరాన్ని తయారు చేశారు. ఇది కాంక్రీట్ వస్తువుల, నిర్మాణాల స్థితి గురించి తక్షణమే నిర్ణయిస్తుంది. బాహ్యశక్తి వనరుల ద్వారా పనిచేయకుండా ఇది కొలతలలో గొప్ప నిర్దిష్టత చూపుతుంది.*

"స్నేహితులు లేనివారికి హృదయం శూన్యం; సోమరులకు ఈ భూమి ఖాళీ; పేదవారికి మూడు విశ్వాలు నిరర్థకాలు."

— పంచతంత్రం

భూమిలో - ఏ విధంగా మార్పిడి చేయగల మనే అంశంపై విస్తృత అధ్యయనం చేశాడు. భూమికి పైగా - ఎత్తున - విద్యుత్ ఉత్పత్తి కేంద్రాలను స్థాపించాలని సూచించాడు. ప్రతి స్టేషన్ 5,000 మెగావాట్స్ విద్యుచ్ఛక్తిని భూమికి విడుదల చేస్తుంది. అమెరికా నగరాలైన లాస్ ఏంజిల్స్ లేదా చికాగోలకు సరఫరా అయ్యే విద్యుత్ కన్నా ఇది ఎక్కువ.



ప్రిన్స్‌టన్ యూనివర్సిటీకి చెందిన ప్రొఫెసర్ గెరాల్డ్ కె. ఓనీల్ - భూమి పైన కర్మాగారాలను నిర్మించి, వాటిని ప్రారంభం చేసే కన్నా చంద్రునిపై త్రవ్వి తీసిన వస్తువులతో అంతరిక్షంలో శాటిలైట్ సోలార్ పవర్ స్టేషన్లు (ఉపగ్రహ సౌర విద్యుత్ కేంద్రాలు) నిర్మించాలని సూచించాడు. భూమినుండి అంతరిక్షం కంటే చంద్రుని నుండి భూమికి రవాణా చేయటం చాలా చౌక. అంతరిక్షంలోని రిఫైనరీలకు, ఫ్యాక్టరీలకు - పుష్కలంగా ఉండే సౌరశక్తిని - ఉపయోగించుకోవచ్చు. ఈ విధంగా ఇంధన సంక్షోభాన్ని ఎదుర్కొనే మార్గం ద్వారా బహుశ 30 సంవత్సరాల కాలం వరకు సంపద సమకూర్చుకోవచ్చు.

యుఎస్ నేషనల్ ఏరోనాటిక్స్ అండ్ స్పేస్ అడ్మినిస్ట్రేషన్ (నాసా) కు చెందిన శాస్త్రజ్ఞులు మరియు ఇంజనీర్ల అభిప్రాయం ప్రకారం ఒక ఉపగ్రహ సౌర విద్యుత్ కేంద్రం వంటి భారీ సంస్థను నిర్మించి, దానికి మద్దతు (సేవలను) అందించేందుకు కనీసం 10,000 మంది ప్రజలు అవసరమౌతారు. అంతరిక్షంలో ఒక నగరం మరియు ఒక చిన్న గనులు త్రవ్వే శిబిరం చంద్రునిపై రూపొందించాలి. అక్కడ ప్రతిరోజు 150 మంది 3,000 మెట్రిక్ టన్నుల చంద్రమండలపు మన్ను త్రవ్వి, 15 కి.మీ.ల పొడవు గల ఎలక్ట్రోమాగ్నటిక్ (పైకి లేపు) యంత్రం ద్వారా అంతరిక్షంలో తేలేటట్లు వదలాలి. అపొల్లో అంతరిక్ష వాహనంలో పయనించిన వ్యోమగాములు, శాస్త్రవేత్తలు తెచ్చిన చంద్రమండలపు రాళ్ళను పరిశీలిస్తే చంద్రమండలపు మట్టిలో దాదాపు 30 శాతం వివిధ రకాల ఖనిజాలు ఉన్నట్లు వెల్లడయింది ఈ వస్తువులను అంతరిక్షంలోనే సేకరించి అంతరిక్ష నగరానికి రవాణా చేయాలి. ఇది చంద్రుని సంచార మార్గంలోని రెండు కేంద్రాలలో ఒక దానిలో నెలకొల్పాలి, (చంద్రుని

## ప్రపంచంలోని సగం బంగారం దక్షిణాఫ్రికాలో లభ్యం

*1886 లో జొహాన్నెస్‌బర్గ్ యొక్క ప్రధానమైన జాతిచట్టు కనుగొన్న తరువాత - దక్షిణాఫ్రికా, ప్రపంచంలోని దాదాపు సగం బంగారాన్ని వెలికి తీసింది. ఇప్పటికీ ప్రపంచానికి తెలిసిన బంగారపు నిల్వలలో కనీసం సగం అక్కడ ఉన్నాయి. ఈ దేశం మూడవవంతు బంగారాన్ని గనుల నుండి త్రవ్వి తీస్తుంది. 1970లో అన్ని కాలాల రికార్డుగా 1000 టన్నుల బంగారం ఉత్పత్తి జరగగా, ఇప్పుడు 40 శాతం తగ్గుదలలో ఉన్నది.*

— *"సౌత్ ఆఫ్రికన్ పెనోరమా" సౌజన్యంతో*

"ఈ ప్రపంచంలో నేను కనుగొన్న గొప్ప విషయం - మనం ఎక్కడ నిలబడ్డామని కాదు, మనం ఏ దిశగా పయనిస్తున్నామన్నది."

— ఓ.డబ్ల్యు. హెూమ్స్

380,000 కిలోమీటర్ల దూరంలో). అంతరిక్ష నగరంలో భూమి, చంద్రుని ఆకర్షణ శక్తి ఒకదాన్ని మరొకటి సరితూచుకుంటాయి. అంతరిక్ష నగరం భూమిని, చంద్రుణ్ణీ అంతరిక్షం ద్వారా అనుసరిస్తుంటుంది. కానీ ఈ రెండింటికి సంబంధించినంతవరకు అదే యథాస్థానంలో నిల్చి ఉంటుంది.

ఇంజనీరింగ్ సమస్యలు ఎక్కువగానే ఉన్నప్పటికీ, మానవుణ్ణి చంద్రమండలం పైకి పంపేందుకు జరిపిన ప్రయత్నంతో పోల్చితే ఇవి తక్కువగానే కనిపిస్తాయి. కాస్మిక్ కిరణాల నుండి జనాభాను కాపాడేందుకు ఒక బ్రహ్మాండమైన రేడియేషన్ కవచం అత్యంత అవసరం. దాదాపు 2 కి.మీ.ల వ్యాసం గల పెద్ద చక్రాకారపు నగరాన్ని పరిభ్రమింప చేయటం ద్వారా భూమి యొక్క గురుత్వం అనుకరిస్తుంది. ఈ నగరంలో ప్రజలు నివసిస్తారు. 65 హెక్టార్లలో ఒక చిన్న వ్యవసాయ క్షేత్రం సైజు) 10,000 మందికి ఆహారం పెట్టేందుకు వ్యవసాయం జరుగుతుంది.

దీనికయ్యే వ్యయం కూడా ప్రతిబంధకం కాదు. వైద్య విద్య సంక్షేమ శాఖలకు సంబంధించి అమెరికా ఫెడరల్ బడ్జెట్‌లో వచ్చే 20 నుంచి 25 ఏళ్ళల్లో వ్యయం చేసే శాతం డబ్బు - భూమికి ఉపయోగించే ఇంధనం, కాలుష్యం తగ్గుదల వంటివి - తెచ్చి పెడుతుంది. దీన్ని బాధ్యత వహించే దేశానికి పెట్టుబడి తిరిగి- రావటమేకాక 35 ఏళ్ళల్లో 10 శాతం వడ్డీ కూడా లభిస్తుంది.

అంతరిక్షంలోని పరిస్థితులపట్ల శాస్త్రజ్ఞులు ఇప్పటికీ అజ్ఞానంలోనే ఉన్నారు. ఆ పరిస్థితికి స్త్రీ పురుషులు ఏవిధంగా ప్రతిస్పందిస్తారో వీరికి తెలియలేదు. మనుషులను, యంత్రాలను పంపి అంతరిక్షాన్ని మరింత పరిశోధించాలని వీరు కోరుకుంటున్నారు. జీరో (శూన్య) గురుత్వం మరియు పరిభ్రమణ విధానాలు - ప్రాణులపై చూపే ప్రభావం ఏమిటో ఇంతవరకు తెలుసుకోలేకపోయారు. భూమికి సమీపాన అంతరిక్షంలో ఒక పెద్ద పరిశోధన శాల మనకు ఆవశ్యకం, ఇక్కడ మనం పరీక్షలు జరిపి నేర్చుకోవచ్చు.

అమెరికన్ స్పేస్ షటిల్ ఎంటర్‌ప్రైజ్ - ఒక ప్రారంభం మాత్రమే. చంద్రుడు ఖనిజాలకు, ఆక్సిజన్‌కు ఆధారం అయినట్లయితే దీన్ని గురించి మనం తెలుసుకోవలసింది ఎంతో ఉంది. మనకు చంద్రునిపై ఒక స్థావరం కావాలి. అంతరిక్ష సంపదల పూర్తి వినియోగానికి ఆవశ్యకమైన సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి చేసుకునేందుకు మనకు వాస్తవిక పరిస్థితుల అవసరం ఎంతైనా ఉంది. మనం ఇప్పుడు ప్రారంభించి ఒక్కొక్క అడుగే వేసుకుంటూ పనిచేసుకుపోతుంటే 21 శతాబ్ది నాటికి మానవులు గణనీయ సంఖ్యలో అంతరిక్ష నివాసం చేయగల్గుతారు.

## ఏనుగుకు నాలుగు మోకాళ్ళు!



పిల్లలను ఈని పాలిచ్చే తెగకు చెందిన జంతువులలో ఏనుగుకు మాత్రమే నాలుగు మోకాళ్ళు ఉన్నాయి.

"ఒక ఔన్సు వివేకం - ఒక పౌండు చమత్కారం కంటే విలువగల

— థామస్ ఫుల్లర్

# దిగ్భ్రమ కల్గించే ఈఫిల్ గోపురం

కృష్ణ వేణుగోపాల్

ప్రపంచంలో ప్రసిద్ధి చెందిన సరిహద్దు రేఖల్లో (మహత్తర విషయాల)లో ఫ్రెంచి రాజధాని పారిస్‌లోని ఈఫిల్ టవర్ ఒకటి. యునైటెడ్ స్టేట్స్ - న్యూయార్క్‌లోని "స్టాట్యూ ఆఫ్ లిబర్టీ"కి (చట్రం) మూసపోసినవాడు, అనేక వంతెనలను నిర్మించినవాడు, ఫ్రెంచి ఇంజనీర్ అయిన అలెగ్జాండ్రి గుస్టోవ్ ఈఫిల్ - పేరిట ఇది నిర్మించబడింది.




తూర్పు ఫ్రాన్స్‌లోని డిజన్ రాష్ట్రంలో 1832లో ఈఫిల్ జన్మించాడు. పారిస్‌లోని సెంట్రల్ స్కూల్ ఆఫ్ ఇంజనీరింగ్ నుండి పట్టభద్రుడయ్యాడు. తరువాత ఒక రైల్వే నిర్మాణ సంస్థలో పనిచేసేందుకు వెళ్ళాడు.

1850 లో యూరప్ రైల్వే త్వరితగతిలో విస్తృతమౌతున్నది. వంతెనల నిర్మాణంలో అధికారులకు గందరగోళమైన సమస్యలు ఎదురయ్యాయి. ఆ రోజుల్లో వంతెనలు రాతితో నిర్మించేవారు. దీనివల్ల ప్రభుత్వానికి అధిక మొత్తం వ్యయమవటమే కాకుండా నిపుణులైన పనివారు కూడా అవసరమయ్యేవారు.

ఫ్రాన్స్‌లోని బోర్డియక్స్ వద్ద గరోన్నీ నదిపై 1600 అడుగుల వంతెన నిర్మించేందుకు ఈఫిల్ పనిచేస్తున్న కంపెనీకి ఫ్రెంచి రైల్వే ఒక ఒప్పందం (కాంట్రాక్ట్) ప్రతిపాదించింది. ముందుగా తయారుచేసిన (Prefabricated) ఇనుమును అప్పుడు అమలులో ఉన్న పద్ధతి స్థానే నింపినట్లయితే అది నిర్మాణపు వ్యయాన్ని చెప్పుకోదగినంత తగ్గించటమేకాక ఈ వస్తువును నైపుణ్యం లేని పనివారు కూడా కష్టం లేకుండా చేయగలరని ఈఫిల్ సూచించాడు.

ఆ కంపెనీ తన ప్రతిపాదన అంగీకరించగానే ఈఫిల్ పనిలోకి ఉత్సాహంతో ప్రవేశించాడు. వంతెన రికార్డ్ టైంలో సగం ఖర్చుతో పూర్తయింది.

గరోన్నీ వంతెన సాధించిన విజయం ఈఫిల్‌లో కావలసినంత ఆత్మవిశ్వాసాన్ని కలిగించింది. 1866 లో అతని తండ్రి నైతిక మద్దతు, తల్లి ఆర్థిక సహాయాలతో సొంతంగా ఈఫిల్ కన్‌స్ట్రక్షన్ కంపెనీని స్థాపించాడు. సంవత్సరాల తరబడి అతని మేజా - డాములు, వంతెనలు, ఫ్యాక్టరీలు, స్టేషన్లు, నిర్మాణాలకు సంబంధించిన పథకాల్లు, పట్టికలు, రేఖాచిత్రాలతో - పొంగిపొర్లింది.

## కాలానికి విభజనలు లేవు

*గతించిన దానికి చిహ్నంగా కాలానికి భాగాలు, చీలికలు లేవు. ఒక కొత్త నెల లేదా ఒక కొత్త సంవత్సరం ప్రారంభమయేటప్పుడు ఒక పిడుగుల గాలివాన కానీ లేదా భేరీ నినాదాలు కానీ ఎప్పుడూ ఉండవు. ఒక కొత్త శతాబ్ది మొదలైనప్పుడు మనం - గంటలు వాయిస్తాము, పిస్తోళ్ళు పేలుస్తాము.*

*- థామస్ మాన్*

"శ్రేష్ఠమైన దాన్ని ఆశించేటప్పుడు మంచిది మేలైనది కాకపోవచ్చు."

— థామస్ ఫుల్లర్

ఈఫిల్ నిర్మాణాలకు సంబంధించిన సూత్రాలు, అంచనాలను ఆధారం చేసుకుని న్యూయార్క్‌లోని అనేక ఆకాశ హర్మ్యాలు నిర్మించబడ్డాయి. అమెరికాలోని న్యూయార్క్ అఖాతం వద్ద "స్టాట్యూ ఆఫ్ లిబర్టీ", పోర్చుగల్‌లోని డవ్రోనదిపై మేరీపియా వంతెన, ఇంకా ఎన్నో ఇతర నిర్మాణాల వెనుక గల మేథ అతనిదే.

ఫ్రెంచి విప్లవం శత జయంతిని కొనియాడేందుకు మరియు ఆ దేశపు పారిశ్రామిక ప్రగతిని నొక్కిచెప్పి ప్రముఖంగా ప్రదర్శించేందుకు 1889 లో ఫ్రెంచి ప్రభుత్వం "ప్రపంచ వాణిజ్య ప్రదర్శనం" నిర్వహించ దలచింది. ఈ సంఘటనకు జ్ఞాపక చిహ్నంగా ఒక కట్టడం నిర్మించాలని నిర్ణయించింది. 300 మీటర్ల ఎత్తైన గోపురం నిర్మించాలని ఈఫిల్ ప్రతిపాదించగా ప్రణాళికా సంఘం దీన్ని ఆమోదించింది. ఆ నిర్మాణం పని అతనికే అప్పగించింది. కానీ ప్రభుత్వం - మొత్తం వ్యయంలో ఐదవ వంతు మాత్రమే భరించటానికి (దాదాపు ఒక మిలియన్ ఫ్రాంకులు), మిగిలిన మొత్తం చెల్లించటానికి బదులుగా గోపురాన్ని 20 సంవత్సరాలపాటు ఈఫిల్‌కు కౌలుకివ్వటానికి - ముందుకొచ్చింది. ఈ లోటు భర్తీ చేసుకునేందుకు ఈఫిల్ తన కంపెనీని తాకట్టు పెట్టవలసివచ్చింది.

300 మీటర్ల ఎత్తుగల ఒక వైభవోపేతమైన గోపురం ఈఫిల్ రూపొందించాడు. ఇది ఇటలీలోని రోమ్ వద్ద గల సెయింట్ పీటర్స్ బసిలికాకు, ఈజిప్ట్‌లో గిజావద్దగల చియాప్స్‌లోని గొప్ప పిరమిడ్లకు రెండు రెట్లు ఎత్తులో ఉన్నది. గోపురపు పునాది నాలుగు అర్ధవర్తులం గల కమానులతో రెండున్నర ఎకరాల భూమిని ఆక్రమిస్తున్నది. 7500 టన్నుల మొత్తం బరువుగల 12,000 మూల భాగాలను ఉపయోగించే విధంగా ఈ డిజైన్ (నమూనా) రూపొందింది. దీనికి మూడు అంతస్తులు, 1792 మెట్లు ఉన్నాయి. మొత్తం వ్యయం 1 మిలియన్ డాలర్ల పైగా ఉన్నది.

ఇది 17 మాసాల (రికార్డు) కాలంలో నిర్మాణమైంది. 1889 మార్చి 31 న ఇది పూర్తి కాగానే అంతకుపూర్వం ఊహించిన దాని కంటే, ఇది ఇంకా పెద్దదిగా రూపు దాల్చింది. దీని అగ్రభాగం నుండి ఎవరైనా పారిస్ నగరాన్ని విశదంగా చూడవచ్చు. ఇక్కడ నుంచి పారిస్ చుట్టుప్రక్కల 140 కి.మీ.ల దూరం వరకు గల గ్రామీణ ప్రాంతాల్ని కూడా తిలకించవచ్చు. 1931 లో న్యూయార్క్‌లో 380 మీటర్ల ఎత్తుగల ఎంపైర్ స్టేట్ బిల్డింగ్ నిర్మించే వరకు ఈఫిల్ టవర్ ప్రపంచంలోనే ఎత్తైన భవనంగా ఉండేది.

ఈ గోపురానికి ఈఫిల్ పేరుపెట్టబడింది. ఈ గోపురం అధికారపూర్వక ప్రారంభోత్సవం - 1889 జూన్ 10 న - నాటి ప్రిన్స్ ఆఫ్ వేల్స్ - 7 వ ఎడ్వర్డ్ జరిపారు.

ప్రారంభోత్సవం జరిగిన ఎనిమిది మాసాలలో దాదాపు రెండు మిలియన్ ప్రజలు ఈఫిల్ టవర్‌ను సందర్శించారు. ప్రవేశ రుసుం ద్వారా లభించిన ధనంతో ఈఫిల్ ఋణం తుడిచి వేయబడింది.

## ప్రపంచంలో ఎత్తైన ఆర్‌సిసి టవర్

*కెనడాలోని టొరాంటో వద్ద గల కెనెడియన్ నేషనల్ బ్రాడ్‌కాస్టింగ్ అండ్ టెలివిజన్ టవర్ ప్రపంచంలోని అతి ఎత్తైన ఆర్‌సిసి ఫ్రీస్టాండింగ్ నిర్మాణంగా చెప్పబడింది. దీని ఎత్తు దాదాపు 550 మీటర్లు.*

ఆపదలు కత్తుల వంటివి. అవి మనకి సేవ అయినా చేయవచ్చు లేదా మనల్ని ముక్కలుగా
నా కోయవచ్చు - మనం వాటి మొనను (బ్లేడ్) పట్టుకుంటామో లేదా పిడిని పట్టుకుం
'మో అనేదాన్ని బట్టి ఇది ఆధారపడి ఉంటుంది.''

# మేలైన బేకింగ్ పౌడర్

బేకింగ్ పౌడర్ ఉపయోగాలు ఎన్నో ఉన్నాయి. బేకింగ్ పౌడర్ (రొట్టెలు కాల్చేపొడి) సాధారణంగా కేక్స్ (రొట్టె, పిండివంట, భక్ష్యం) తయారు చేసేందుకు ఉపయోగిస్తారు. కొన్ని సమయాల్లో దీన్ని సోడాకు బదులుగా పకోడీలలో, వడలు మొదలైన వాటిల్లో ఉపయోగిస్తారు.

బేకింగ్ పౌడర్ మంటల నార్పేదనీ, శుభ్ర పర్చేదనీ, దుర్వాసన పోగొట్టేదనీ మీకు తెలుసా?



మీకు మీరే స్వయంగా దీని వివిధ ఉపయోగాలను చూడవచ్చు. వంట చేసేటప్పుడు సంభవించే ఒక జిడ్డు మంటను - పొడి - బేకింగ్ పౌడర్ చల్లి త్వరగా ఆర్పివేయవచ్చు. బేకింగ్ పౌడర్ స్వల్పమైన ఆల్కలిన్ స్వభావం కలది. గాఢమైన రసాయనాలు వస్తువుల రంగుల్ని మూసివేసినప్పుడు, ఇతర విధాల చెడు చేసినప్పుడు దీన్ని తేలికగా ఉపయోగించవచ్చు. ఒక లీటర్ నీటిలో మూడు టేబిల్ స్పూన్ల బేకింగ్ పౌడర్ కలిపి, చిన్న ఉపకరణాలను శుభ్రపర్చేందుకు ఉపయోగించవచ్చు. మరింత కష్టమైన మరకల్ని పోగొట్టేందుకు ఎండిన పొడిని తేమగా ఉన్న గుడ్డతో రుద్దటం ద్వారా ఉపయోగించుకోవచ్చు.

ఒక రిఫ్రిజరేటర్ అంతర్భాగాన్ని శుభ్ర పర్చేందుకు, ఎటువంటి గీతలు లేకుండా క్రోమ్‌ను శుభ్రం చేసుకునేందుకు, కాంపింగ్ మరియు ఫిషింగ్ పరికరాలను శుభ్రం చేసుకునేందుకు దీన్ని ఉపయోగించవచ్చు. అయితే దీన్ని అల్యూమినియం వస్తువులపైన ఉపయోగించకూడదు. మచ్చలు తొలగించే ప్రయత్నంలో పాత్రలు నల్లబడటం జరగవచ్చు.

పిల్లల - లో ఉడుపులలోని - దుర్వాసన పోగొట్టేందుకు బేకింగ్ పౌడర్ ఉపయోగించవచ్చు. ఒక తొట్టి నీటిలో సోడా చేర్చి సొల్యూషన్‌తో కూడిన వస్త్రాలను కొంతసేపు నానబెట్టాలి.

మీ చేతుల కంటుకున్న జిడ్డు, దుర్వాసన పోగొట్టుకునేందుకు ఎండిన జిగురు (లేహ్యం)గా ఉపయోగించండి. పౌడర్ (రూపం)లో కొద్దిగా నీటిని చేర్చి దీన్ని దంత ప్రక్షాళనకు కూడా ఉపయోగించవచ్చు.

చర్మాన్ని తాజాగా, చల్లగా ఉంచేందుకు బేకింగ్ పౌడర్‌ను మీ స్నానపు నీటిలో కలుపుకోవచ్చు.

బేకింగ్ పౌడర్ - రోగ క్రిముల్ని తొలగించి శుభ్రపర్చేది కాదని గుర్తుంచుకోండి. ఇది మృదువుగా, సాధు స్వభావంతో ఉన్నందువల్ల ఎక్కువగా మురికి చేరిన వస్తువుల్ని అమోఘంగా శుభ్రం చేయలేకపోవచ్చు.

"గంభీరంగా, మితంగా, ఆత్మ నిగ్రహంతో ఉండండి. అప్పుడు మీరు ఆరోగ్యంగా ఉంటారు." — ఫ్రాంక్లిన్



### జవాబులు

క్విజ్:- 1. (బి) శివరాజ్ పాటిల్, 2. (డి) మహమ్మద్ - బిన్ - తుఘ్లక్, 3. (డి) బుధుడు, 4. (సి) చరణ్ సింగ్, 5. (సి) సామవేదం, 6. (ఎ) జీర్ణక్రియ, 7. (బి) ఆదాయానికి మించిపోవటం, 8 (బి) బాంకింగ్ వ్యవస్థ.

**మాటల మహిమ:** 1. (ఎ) అవికె, (బి) కుబుసము, (సి) కవచము, (డి) పాము కుబుసము; 2. (ఎ) అంతఃపురపు కావలివాడు, (బి) విటుడు, (సి) పాము, (డి) అగరుమ్రాను; 3. (ఎ) శంఖము, (బి) ఏనుగు, (సి) కడియము, (డి) నత్తగుల్ల; 4. (ఎ) అవ్యక్త మధుర ధ్వని, (బి) కోలము, (సి) నెమలి, (డి) పావురము; 5. (ఎ) మరణము, (బి) చావు; 6. (ఎ) ఒకానొక యేఱు, (సి) పసుపు, (డి) వెలయాలు; 7. (బి) కోయిల, (సి) చిలుక, (డి) వన్నెచెటు· 8 (ఎ) యశము, (బి) విరివి, (సి) 7 (డి) అడుసు.

**తెలివికి పరీక్ష:** 1. పారిస్‌లోని సెయింట్ విన్సెంట్ - డి. పాల్ హాస్పిటల్‌కు చెందిన శాస్త్రజ్ఞులు "ఎడ్రినో ల్యూకోడైం ట్రొఫీ" (ఏ.ఎల్.డి.) అనే వ్యాధికి కారణమౌతున్న జన్యువును గుర్తించారు. నాడీ కండరాల చుట్టూ కవచంలా ఉండే మైలీన్ ప్రోటీన్‌పై ఏఎల్‌డి వ్యాధి దాడి చేస్తుంది. దీని ఫలితంగా ఆ నాడీ కండరాల నుంచి సంకేతాలు శరీరంలోని ఇతర భాగాలకు చేరవు. దీనివల్ల పక్షవాతం, అంధత్వం, మాటపోవటంతో బాటు ఇతర శారీరక పనులు కూడా ఆగిపోవచ్చు. ఇది సాధారణంగా 15 నుంచి 30 ఏళ్ళ వయస్సులోని మగవారికే వస్తుంది. ఇది జన్యువు లోపం వల్ల వస్తుంది. ఈ జన్యువు జీవకణాల మెంబ్రేన్‌ల మధ్య పదార్థాల రవాణాను నియంత్రిస్తుంది, 2 ఉత్తర అట్లాంటిక్ సముద్రంలోని గ్రీన్‌లాండ్. ఇది డెన్మార్క్‌లో భాగం. జనాభా 60 వేల కన్నా తక్కువే. ఇక్కడ ఎస్కిమో జాతి సంతతి అధికంగా ఉంటారు, 3. విరూపాక్షుడు, 4. గోదావరి, 5. దీనార్, రియాల్, టాకా, 6. అడివి బాపిరాజు.

## ప్రతిదీ పరస్పరాశ్రయమే

ప్రతి వస్తువు పరస్పర సహకారం కోరేదే. మనిషి, జంతువు మరియు పరిసరాలు - దాని ఆర్థికపరమైనదీ, రాజకీయపరమైనదీ సందర్భం ఏదైనా ప్రతిదీ ఒకదానితో ఒకటి సంబంధం కలదే. ఇప్పుడు జంతువులకు ఏదైనా జరిగితే అది మనిషికి కూడా సంభవిస్తుంది. మన ఆర్థికాభివృద్ధికి వలెనే మన వారసత్వపు సంరక్షణకు కూడా అంతే భద్రత కలిగించటం ఆవశ్యకం.

— ఇందిరాగాంధీ

## ఆశాపూరిత విశ్వాసం

మన ధైర్యం, మన ఆత్మవిశ్వాసం, మనలోని ఆశాపూరిత విశ్వాసం, భవిష్యత్ పట్ల నమ్మకం పైనే ప్రతిదీ ఆధారపడుతుంది.

— ఓరిసన్ ఎస్. మార్డిన్

## స్నేహితుని సంప్రదించు

అన్ని విషయాలపైన మీ మిత్రునితో సంప్రదించు - ముఖ్యంగా మీరు స్వయంగా గౌరవించే వాటి విషయంలో. అతని సలహా మీకు తోడ్పడవచ్చు - మీకు వాటిపై గల సొంత ప్రేమ మీ తీర్పును చెడగొట్టవచ్చు.

"ఆనందప్రదమైన దేశాలకు వలెనే సుఖదాయకులైన స్త్రీలకు కూడా చరిత్ర ఉండదు."
— జార్జి ఇలియట్

# వెదురుతో వెయ్యి ఉపయోగాలు

ఆసియాను, ముఖ్యంగా ఆగ్నేయాసియాను వెదురు తోపుల ఖండం అని పిలవవచ్చు. ఇక్కడ దాదాపు 550 జాతుల (వర్గాల) వెదురు తెగలు ఉన్నాయి. ఒక్క ఆసియాలో మాత్రమే 320 రకాలు ఉన్నాయి. ఇండియాలో 130, బర్మాలో 39 మరియు దక్షిణ అమెరికాలో 179 రకాలు ఉన్నాయి. సముద్ర మట్టం నుండి మంచు శ్రేణి వరకు ఎక్కడైనా వెదురు వృద్ధి చెందుతుంది. అయితే ఇది అత్యధిక అభివృద్ధి - వర్షాకాలపు అడవుల్లోనే - జరుగుతుంది. వెదురు త్వరగా పెరుగుతుంది. ఒక రోజులో 2 నుంచి 3 అడుగుల వరకు పెరుగుతుంది.



పూర్తిగా వెదురుతో నిర్మించిన ఇళ్ళల్లోనే లక్షలాది ప్రజలు నివసిస్తారు. చెప్పుకోదగినంత చౌకగా, సమృద్ధిగా లభించే గృహ నిర్మాణపు వస్తువు ఇదే. వివాహపు పందిళ్ళు, వస్తు ప్రదర్శన శాలల డేరాలు, యజ్ఞశాలలు - ఇవన్నీ త్వరితంగా, చౌకగా నిర్మించవచ్చు. రాత్రికి రాత్రే శరణార్థుల ఆశ్రయాలను నిర్మించవచ్చు. మేళాలు మరియు నీడనిచ్చే ఆశ్రయాలు - వెదుళ్ళను ఉపయోగిస్తాయి. నిడుపైన, మృదువైన, దృఢమైన బోదె (దంటు)ను చీల్చి చాపలుగా మరియు పైకప్పు సామగ్రిగా నేసుకోవచ్చు. పేడతో, మట్టితో అలికిన తట్టీలు ఆశ్రయానికి, గోప్యానికి పనికి వస్తాయి. కేవలం ఒక్క చీల కూడా ఉపయోగించకుండా వెదురుతో ఇళ్ళు నిర్మించటం జరిగింది!

వెదురుతో తయారు చేసిన గృహోపకరణాల లోని అపారమైన వైవిధ్యానికి అంతులేదు. వెదురు మంచాలు, సులభంగా మోయదగిన కుర్చీలు, టేబుళ్ళు, లాంప్‌షేడ్స్, పండ్లు, పువ్వులు రవాణా చేసే బుట్టలు - వెదురుతో తయారవుతున్నాయి. వ్రాత కాగితం తయారీలో వెదురును అధికంగా ఉపయోగిస్తున్నారు. ఎలక్ట్రిక్ బ్యాటరీలకు వెదురు బొగ్గు ఉపయోగపడుతున్నది.

సుదూర ప్రాంతాలలోని గ్రామాలలో ఇప్పటికీ పాలను, నేతిని కొలిచేందుకు వెదురు గొట్టాలను ఉపయోగిస్తారు. వీటిని సోలలని పిలుస్తారు.

## వయసు, అనుభవం నేర్పేవి పుస్తకాలు - నేర్పలేవు

*అనేక రంగాలలో వయసు అనర్హతగా పరిగణించినా, మరి కొన్ని రంగాలలో వయసు గుర్తింపు పొందింది. ఒక వ్యాపారస్తుడు తన క్యాషియర్‌గా ఒక యువకునికంటే ఒక గౌరవనీయుడైన వ్యక్తినే ఎంపిక చేసుకుంటాడు. పాలకులుగా, మార్గదర్శకులుగా మన ఎంపిక - వయసుతో, అనుభవంతో కోమలమైన వారివద్దకే పోతుంది. జీవితాన్ని చూసి, దాని నుంచి పాఠాలు నేర్చుకున్న వ్యక్తి దగ్గరకే మనం సహజంగా సలహా కోసం వెళ్ళుతాము. వయస్సు, అనుభవం నేర్పిన దాన్ని పుస్తకాలు ఎంతమాత్రం బోధించలేవు. భౌతిక విషయాలలో కూడా - వయస్సు - ఉత్తమ నాణ్యతనే తరచుగా వెంట తీసుకు వస్తుంది. కనుక మీ వయస్సు గురించి సిగ్గు చెందకండి. దాని నష్ట పరిహారాలు దానికి ఉన్నాయి.*

"సోమరిగా ఉండవద్దు; మీ హస్తాలు ఉపయోగకరమైన పని చేయక పోయినట్లయితే, మీ మేథ యొక్క సేద్యానికి హాజరుకండి."

నాటుపడవలను నడిపేందుకు వెదురు కర్రలను - ముందుకు త్రోసే చోదక సాధనంగా - ఉపయోగిస్తారు. పోలో బంతులు - వెదురు చెట్ల వ్రేళ్ళతో ప్రత్యేకంగా తయారు చేస్తారు. సుదీర్ఘమైన, దృఢమైన ఒక వెదురు కర్రకు ఎగరేసిన జాతీయ పతాక ద్వారా వెదురు కర్రకు అఖండ గౌరవం లభించింది.

సులభంగా వంగే వెదురును పల్లకీ, ఠపాలా సంచులు, నీటిని మోసేవారు ఉపయోగిస్తారు. పల్లెటూరి బండ్లు తాత్కాలిక వెదురు పైకప్పుతో వాహనాలుగా మారుతాయి. ఠయా ఋతువుల్లో వండే వండ్ల మార్కెట్లు, షెడ్లు తమ వస్తువులను నిల్వ చేసేందుకు, ్రక్రయించేందుకు బ్రహ్మాండమైన పందిళ్ళను ర్మిస్తాయి. వ్యాధిగ్రస్తమైన పశువులకు షధం లోనికి పంపేందుకు వెదురు గొట్టాలను శు వైద్యశాలలు ఉపయోగిస్తాయి. ఆంధ్రులలో ెళ్ళికుమార్తెను వెదురుబుట్టలో మోసుకువెళ్ళే ంప్రదాయం కూడా ఉన్నది! పెళ్ళి కుమార్తె ఎనమామ ఆ ఉల్లాసకరమైన, సిగ్గుతో ఎర్రబారిన దనంగల మేనకోడలిని పెళ్ళి పందిరిలోకి దురుబుట్టలో మోసుకుపోతాడు.

నీటిని తోడుకునేందుకు వ్యవసాయదారులు మురును సంపూర్తిగా ఉపయోగించుకుంటారు. అకు, అరటి మరియు తమలపాకుల చెట్లకు ాతగా వెదురుగడలు కడతారు. వెదురు ర్రలతో నిర్మించిన ఒక పూర్తి గుడారాన్ని ామీణ సర్కస్ కళాకారుడు తన వెంట సుకువెళ్తుంటాడు. కొందరు గ్రామీణ చేతి త్తులవారు వెదురుతో చిత్తు కాగితాల బుట్టలను, తగుడ్లు వేసే బుట్టలను తయారు చేస్తారు. ల్చిన వెదురు బద్దలతో లాంప్‌షేడ్స్ కూడా యారు చేస్తారు!

వెదురులోని కొన్ని భాగాలు తినదగినవిగా ఉండి, ఊరగాయగా వేయబడతాయి. ఆరోగ్యం కాపాడుకునేందుకు కొందరు వెదురు బియ్యం వాడతారు.

గొప్ప అన్వేషి అయిన ఎడిసన్ తన తొలి విద్యుత్ దీపాలకు వెదురు యొక్క కార్బనైజ్డ్ ఫిలమెంట్‌ను ఉపయోగించాడని చెబుతారు. కొన్ని అత్యవసర పరిస్థితుల్లో వెదురు యొక్క రేజర్ పదునుగల దంటు (పై తోలు)ను శస్త్ర చికిత్సకు కత్తిగా ఉపయోగించటం జరిగింది.

## విద్యుత్ ఉత్పత్తి యంత్రం



అన్ని విద్యలకు, అన్ని శిక్షణలకు ఆదర్శం - మనిషిని తయారు చేయటం. కానీ దీనికి బదులుగా మనం ఎప్పుడూ బయటదాన్ని మెరుగు పెట్టేందుకు ప్రయత్నిస్తున్నాము. లోపలిది లేనప్పుడు వెలుపలి దాన్ని మెరుగు పెట్టినందువల్ల ప్రయోజనం ఏమిటి? అన్ని శిక్షణలకు లక్ష్యం, ధ్యేయం ఒక్కటే - మనిషి పెంపుదల. తన పలుకుబడిని, ప్రభావాన్ని తోటివారిపై ప్రసరింపచేసే మనిషి - విద్యుత్ ఉత్పత్తి చేసే యంత్రం వంటివాడు. ఆ మనిషి సంసిద్ధుడైతే, అతడు ఏదైనా చేయగలడు, తనకు ఇష్టమైన ప్రతి పనీ చేయగలడు. దేనిపైన అయినా అతని వ్యక్తిత్వం ప్రసరించి ఆ పనిని నెరవేరుస్తుంది.

— స్వామి వివేకానంద

"మీకు తెలిసినదాన్ని తెలుసుకోవటం, మీకు తెలియనిదాన్ని తెలుసుకోవటం - ఎరుక (తెలివిడి) కల వ్యక్తి యొక్క ప్రత్యేకత."

— కన్‌ఫ్యూసియస్

# ఎలా?

## నెలల్లో మార్పులు ఎలా జరిగాయి?

వలెరి సిమకోవ్

పన్నెండు నెలల క్యాలండర్ ఆలోచన - ప్రాచీన ఈజిప్ట్‌కు చెందుతుంది. తరువాత దీన్ని రోమన్లు ఎరువు తెచ్చుకున్నారు. ఆ వెనుకటి కాలంలో మార్చి 1 తేదీన సంవత్సరం ప్రారంభమయ్యేది. సమరయోధుడైన దేవుడు - అంగారకుని పేర - సంవత్సరంలో మొదటి మాసం పిలవబడేది. వివిధ దేవుళ్ళు దేవతల



AUGUSTUS CAESAR

గౌరవార్థం ఇతర మాసాలు పిలవబడేవి. మే - (దేవత - మజ), జూన్ - (దేవత - జూనో), జనవరి - (దేవుడు - జానుస్). మరియు ఆగస్టులకు జూలియస్ మరియు చక్రవర్తి అక్టావియనస్ అగస్టస్ పేర్లు అజరామరంగా నిలిచాయి. ఏప్రిల్ లేదా 'ఏప్రిలిస్' అంటే అర్థం: "వేడి సూర్యుని నెల." ఫిబ్రవరి లేదా 'ఫెబ్రు అరిస్'-కు "పరిశుభ్రత నెల" అని అర్థం. మిగిలిన నాలుగు మాసాలు సులభమైన, మౌలిక సంఖ్యా శాస్త్రపు నెలలు - ఏడవది (సెప్టెంబర్), ఎనిమిదవది (అక్టోబర్), తొమ్మిదవది (నవంబర్) మరియు పదవది (డిసెంబర్).

అయితే ఏడవనెల (సెప్టెంబర్) తొమ్మిదవది ఎలా అయింది? ఎనిమిదవనెల (అక్టోబర్) పదవ నెల, తొమ్మిదవ నెల (నవంబర్) పదకొండవ నెల మరియు పదవ నెల (డిసెంబర్) పన్నెండవ నెల ఎలా అయ్యాయి?

నిజానికి, ఇది చాలా సులభమైనది. జూలియస్ సీజర్ చక్రవర్తి సంవత్సరాన్ని ముందుకు జరిపినందువల్ల అది ఇప్పుడు జనవరితో ప్రారంభమైంది! దీనివల్ల డిసెంబర్ సంవత్సరంలో చివరి నెలగా రూపొందింది. అదే 12వ నెల.

## డొంక తిరుగుడు

*అలెగ్జాండర్ పాట్ మరియు జానీ నాట్ మధ్య ద్వంద్వ యుద్ధం జరిగింది. పాట్ చేత నాట్ కాల్చబడ్డాడు తాను నాట్‌ను కాల్చానని పాట్ చెబుతున్నాడు అలా జరగలేదని నాట్ అంటున్నాడు. ఏమైనా ఎవరు కాల్చారో, ఎవరు కాల్చలేదో చెప్పటం కష్టం. పాట్ నాట్‌ని కాల్చాడని కొందరు చెప్పారు. అది పాట్ యొక్క కాల్పు కావచ్చు, నాట్‌ని కాల్చడం కావచ్చు లేదా పాట్ తానే స్వయంగా కాల్చుకుని ఉండవచ్చు. పాట్ లేక నాట్‌లలో ఎవరు గెలిచారనేది చెప్పటం కష్టం .*

"సమయాలు మీకు అనుకూలించనపుడు; మీరు సమయాలకు అనుకూలించేటట్లు చూసుకోండి." - టర్కీ సూక్తి

# మన ప్రాచీనుల మహాత్కార్యాలు

## బావిలో కట్టిన భవనం

ఏ.ఆర్. షెరీఫ్

గుజరాత్ రాష్ట్రం (పశ్చిమ భారతం)లోని అహమ్మదాబాద్ సమీపంలో గల అడలజ్ గ్రామంలో పూర్తిగా భూగర్భంలో నిర్మితమైన భవనం ఉన్నది. అడలజ్ మెట్ల బావి అని పిలువబడే ఈ నిర్మాణం ఒక ఐదంతస్తుల భవనం. ఇది దాదాపు 100 అడుగుల పొడవు కలిగి ఎన్నో పెద్ద గదులు, దారులు రాతి ద్వార మండపాలతో అలరారుతుంటుంది.


Step-Well of Adalaj, Gujarat

నీ దీన్ని నిర్మించేందుకు జరిపిన ప్రయత్నాలు, నరులు - ఇది ఒక సాధారణ బావి కాదని ఋజువు చేసాయి. వీర్‌సింగ్‌కు చెందిన మహారాణి రుడాబాయ్ చేత నిర్మించబడిన భవనం - అహమ్మదాబాద్‌లోనూ, ఆ పరిసరాల లోనూ, కన్పించే ఇటువంటి అనేక భూగర్భ సవంతులలో ఒకటి మాత్రమే.

ఒక చివర రెండు మండపాలు, మరో వర లోతైన బావి - వీటి మధ్య అవరోహణ క్రమంలో ఈ భవనం నిర్మించబడింది.

ఈ నిర్మాణానికి సంబంధించిన అన్ని అంతస్తులు బావికి అనుసంధానం చేయబడ్డాయి.

మండపం (పెవిలియన్) - భూగర్భ మందిరానికి ప్రవేశమార్గంగా పని చేస్తుంది!

క్రింద నున్న మొదటి అంతస్థు నుంచి ఒక మెట్లదారి - బావి దగ్గరకు, రెండవ అంతస్తు వరకు - వెళ్ళుతుంది. ఆ తరువాత వచ్చే ప్రతి అంతస్తు భూమిలోకి లోతుగా వెళ్ళి బావిలోని నీటి మూలానికి చేరు కుంటుంది.

గోడలు, స్తంభాలు, కమానులు, గోడలో అమర్చిన గూళ్ళు మరియు పైకప్పు - భవనంలోని ప్రతి భాగం - విభిన్న పద్ధతుల చెక్కడాలతో అందంగా అలంకరించబడి ఉంటుంది. పూర్తిగా భూగర్భంలో ఉన్నందువల్ల, బావితో అనుసంధానం చేయబడినందువల్ల - అత్యంత వేడిమి గల ఈ ప్రాంతపు వేసవిలో కూడా చల్లదనం కలిగి ఉంటుంది. ఈ వాస్తవం, భవనం యొక్క విస్తృతమైన పథకం మరియు అలంకరణలతో కలిసి - ఇదొక బావి మరియు పాలకుల వేసవి విడిదిగా - మనల్ని (ఈ రెండింటిని) - దృఢంగా విశ్వసింపజేస్తుంది.

## శ్రమపడే కాలం!

మీ పచ్చిక బయలులో స్వల్పంగా శ్రమపడే కాలం - వసంతఋతువు. అది ఆ తరువాత అత్యంత శ్రమపడే ప్రతిఫలం అందిస్తుంది.

"నీవు అరణ్యం సమీపంలో నివసిస్తున్నా, వంట చెఱకును వ్యర్థం చేయవద్దు."
— చైనా సూక్తి

# బహుదూరపు బాటసారులు-సైబీరియా కొంగ

బి.కె. సింగ్

ఇండియా మైదాన భూములకు వచ్చే నాలుగు రకాల అందమైన కొంగలలో ఇంపైనది - గొప్ప తెల్లదనంగల - సైబీరియన్ కొంగ. ఈ సైబీరియన్ కొంగలు హిందూ కుష్ పర్వతాల మీదుగా వలస వస్తాయి. ఈ 6,200 కి.మీ.ల పయనం - ఆర్కెటిక్, (ఉత్తర రష్యాలోని సమతల వృక్షరహిత ప్రాంతం) నుండి ఇండియా లోని రాజస్థాన్ రాష్ట్రంలోగల భరత్‌పూర్ సమీపంలో ఉన్న కియొలదేవ్ నేషనల్ పార్క్‌కు - జరుగుతుంది. గత పదేళ్ళలో ఇండియాకు సైబీరియన్ కొంగల రాక 70,80 పక్షుల నుండి 30, 40 పక్షుల మేరకు తగ్గిపోతూ వస్తున్నది.


SIBERIAN CRANE

చలికాలంలో (నవంబర్, డిసెంబర్, జనవరి) సైబీరియన్ కొంగలు, తమ ప్రయాణాన్ని ఆర్క్‌టిక్ Tundras నుండి ప్రారంభించి ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్‌ల మీదుగా రాజస్థాన్‌లోని నేషనల్ పార్క్‌కు చేరుకుంటాయి. మార్గమధ్యంలో విశ్రాంతికోసం రాత్రి వేళల్లో తమకు లభ్యమైన తేమ నేలల్లో దిగుతాయి. అప్పుడు కొండ కనుమల్లో సంచరించే గిరిజనులు ఈ కొంగలను కాల్చి చంపుతారు. దీని ఫలితంగా గత దశాబ్దిలో ఈ కొంగలకు భారీ నష్టం సంభవించింది. సైబీరియన్ కొంగలు తిరిగి తమ స్వస్థానానికి ఫిబ్రవరి - మార్చి నెలల్లో చేరుకుంటాయి.

వీటి ప్రయాణపు సరైన మార్గం, ఇవి త్రోవలో "మకాం" చేసే ప్రాంతాలను గురించి కనుగొనేందుకు ప్రస్తుతం శాస్త్రజ్ఞులు ఒక అంగీకృత కార్యక్రమంతో పని చేస్తున్నారు. ఈ కొంగల వీపులపై చిన్న రకం సాటిలైట్ ట్రాన్స్‌మిటర్స్ అమర్చటం ద్వారా - వీటి మార్గాన్ని తెలుసుకోవటంలో - కొంతవరకు విజయం సాధించారు.

వలసకు సంబంధించిన ఒక విచిత్ర లక్షణం ఈ కొంగలకు ప్రకృతి ప్రసాదించటం బహుశా మంచిదే కావచ్చు. వలస వెళ్ళటం, శిశు సంతతిని ఉత్పత్తి చేసే స్థలాలకు వెళ్ళదలచటం, తెగమార్పు - ఒక సహజ ప్రేరణగా జీవశాస్త్రం అంగీకరించింది. ఆహారపు కొరత, పగటి వెలుతురు తగ్గుదల, చలి అధికం కావటం - ఇవి వలస వెళ్ళేందుకు పురికొల్పే కారణాలు కావచ్చు. పగటివేళ సూర్యుని స్థానం, రాత్రి వేళ నక్షత్రాల స్థితి ఈ పక్షులు తమ దారి కనుగొనేందుకు తోడ్పడి, ఒక కచ్చితమైన మార్గాన ఇవి సాగేందుకు దోహదం చేస్తాయంటే - మనకు కొంత వింతగా కనిపిస్తుంది. ఈ వలస వచ్చే పక్షులకు - తుఫానులు, ఉప్పెనలు, ప్రచండ వాయువులు, పొగమంచు, మనిషి నిర్మించిన గోపురాలు, నావికులకు దిక్కులు తెలిపే దీప స్తంభాలు, వేటగాళ్ళ నిరంతర కాల్పులు (హత్యలు) పెద్ద సమస్యల్ని తెచ్చి పెడుతున్నాయి.

"ఒక మనిషి హోదాకు ఖ్యాతి తీసుకురావచ్చు; కానీ ఏ హోదా కూడా మనిషికి ఘనత తేలేదు."

# వీరిని గురించి తెలుసుకోండి

2వ ఎలిజబెత్: యునైటెడ్ కింగ్‌డంకు మహారాణి మరియు కామన్వెల్త్ ఆఫ్ నేషన్స్‌కు అధినేత ప్రధానమంత్రి, అతని మంత్రి మండలి ఆమె పేర పరిపాలన సాగిస్తారు. ఆమె అనేక ప్రజా సంబంధమైన మరియు లాంఛనప్రాయమైన కర్తవ్యాలను నిర్వహిస్తారు.


LALBAHADUR SHASTRI

లాల్ బహదూర్ శాస్త్రి (1904 - 1966): కాశీ విద్యాపీఠంలో విద్యాభ్యాసం చేసి 'శాస్త్రి' పట్టాన్ని పొందారు. 1964లో భారత ప్రధానిగా పండిట్ - జవహర్ లాల్ నెహ్రూ తర్వాత- నియమితులయ్యారు. 1965లో ప్రధాన మంత్రిగా భారత పాకిస్తాన్ యుద్ధాన్ని ధైర్యంతో, ఆత్మ విశ్వాసంతో ఎదుర్కొని శాంతిని స్థాపించారు. శాంతి ఒప్పందంపై సంతకాలు కాగానే 1966లో తాష్కెంట్‌లో కన్నుమూశారు.

ఆర్.కృష్ణన్: మృదువైన భారత టెన్నిస్ క్రీడాకారుడు. 1960 మరియు 1961లో వింబుల్డన్ వద్ద - సెమీ ఫైనల్స్‌కు చేరుకున్న మొదటి భారతీయుడు. 1953 నుండి 1966 వరకు ఆసియా ప్రప్రథముడుగా హోదా పొందాడు. ఆసియాలోని మొట్టమొదటి క్రీడాకారునికి లభించే హెల్మ్స్ వరల్డ్ ట్రోఫీ (1966)ని గెలుచుకున్నాడు.

రాంధారిసింగ్ దినకర్: గత తరానికి చెందిన అత్యంత గణనీయులైన హిందీ రచయితల్లో ఒకరు. బహుశా హిందీ రచయితలలో అత్యధికంగా బహుమాన పతకాలు పొందినవారు వీరే కావచ్చు. హిందీలో ఇంతకుముందు

## అసామాన్య బరువును లాగే అభినవ భీముడు

*అత్యంత బరువైన వస్తువును లాగిన ఘనత బ్రిటన్‌కు చెందిన డవ్ గౌడర్‌కు చెందుతుంది*

*అతడు 196 టన్నుల జంబోజెట్‌ను లండన్ హీత్రో విమానాశ్రయంలో 3 అంగుళాలమేర రన్‌వేకు అడ్డంగా లాగ గలిగాడు. వదును చేయబడిన చర్మంతో అతడు విమానానికి కట్టబడ్డాడు.*

*ఇప్పటి వరకు అతడు సాధించిన ఘనకార్యాలలో - ఒక కంకార్డ్ ఎయిర్‌క్రాఫ్ట్, ఒక యుయుఎస్‌బి 52 బాంబర్ మరియు ఒక జపాన్ బుల్లెట్ రైలు లాగటం - చేర్చబడ్డాయి.*

## మర్యాద ఇచ్చే ఫలితాలు

*మర్యాద వల్ల పోయేదేమీలేదు. ప్రీతికరమైన వాటిల్లో అది అత్యంత చౌకగా దొరికేది. దీనికి ఖరీదు ఏమీలేదు. కానీ అందజేసేది, తీసుకు వెళ్ళేది ఎక్కువ. ఇచ్చేవారినీ, పుచ్చుకునేవారినీ - ఇద్దరినీ సంతోషపరుస్తుంది. కరుణ వలే ఇది రెండుసార్లు ఆశీర్వదించబడింది.*

— ఇరాస్టస్ వైమన్

"వ్యాపారంలో విజయం సాధించాలంటే ధైర్యంగా ఉండాలి, పథమంగా ఉండాలి, విభిన్నంగా ఉండాలి."

ఎన్నడూ వ్రాయ బడనంత సుందర గ్రంథంగా వీరి రచన "ఊర్వశి" ప్రశంసలు పొందింది. ఈ రచనకు 1973లో భారతీయ జ్ఞానపీఠ్ అవార్డు (లక్ష రూపాయల నగదు బహుమతితో) - లభించింది.

వాల్ట్ డిస్నీ (1901-1966): అమెరికన్ కార్టూనిస్టు మరియు మిక్కీమౌస్, డోనాల్డ్ డక్ పాత్రలను సృష్టించిన చలన చిత్ర నిర్మాత. మృగ ప్రాణుల కార్టూన్లకు అతడొక మార్గ దర్శకుడు. చలన చిత్ర చరిత్రలో ఏ ఇతర వ్యక్తి పొందనన్ని 'ఆస్కార్ అవార్డ్సు' పొందాడు. కాలిఫోర్నియాలోని అనిహైం వద్ద, ఒర్లాండో వద్దగల పెద్ద అమ్యూజ్‌మెంట్ పార్కులు, యునైటెడ్ స్టేట్స్ లోని ఫ్లొరిడా వద్దగల డిస్నీ లాండ్ ప్రపంచ వ్యాప్తంగా పర్యాటకులను ఆకర్షిస్తాయి.

అశ్వినీ కుమార్ దత్తా (1856 - 1923): పాఠశాల ఉపాధ్యాయుడుగా జీవితం ప్రారంభించారు. కొద్దికాలం న్యాయవాద వృత్తి అవలంబించారు. అనంతర కాలంలో ఒక ఆదర్శ కళాశాలగా వృద్ధి చెందిన సుప్రసిద్ధమైన బ్రజమోహన్ పాఠశాల (బెంగాల్)ను స్థాపించారు. దేశ భక్తి గీతాలను, ఉత్తేజకరమైన వచనాన్ని రచించారు. కుటీర పరిశ్రమలను ప్రోత్స హించారు.

హెర్నాండో డి సోటో (1500 - 1542): సుప్రసిద్ధ స్పానిష్ అన్వేషకుడు. బంగారం కోసం అన్వేషిస్తూ, విరోధి వర్గమైన ఇండియన్లతో పోరాడుతూ అమెరికాలోని మిసిసిపీ నదిని కనుగొని దాన్ని అధిగమించిన మొదటి యూరప్‌వాసి ఇతడే.

## బలహీనమైన దృష్టిగల గబ్బిలాలు ఎలా ఎగరగలవు?



*ఏ వస్తువును ఢీ కొనకుండా గబ్బిలాలు ఎగర గలుగుతాయి. కానీ వీటి కంటి దృష్టి చాలా బలహీనమైనది. ఇవి ఎగురుతున్న సమయంలో - మానవుని చెవి కూడా వినలేనంత అత్యధిక శ్రుతిలో తరచుగా హెచ్చు శబ్ద తరంగాలను వెలువరిస్తాయి. ఈ శబ్ద తరంగాలను సూపర్‌సానిక్ శబ్దాలని పిలుస్తారు. ఇవి ఏదో ఒక వస్తువును తాకి పరావర్తనం చెంది తిరిగి ప్రతిధ్వనులు గానే గబ్బిలం చెవులకు చేరుకుంటాయి. ఈ ప్రతిధ్వనులను ఏరుకునే విధంగా గబ్బిలాల చెవులు - అనుకూలం - చేయబడ్డాయి. గబ్బిలం ఈ ప్రతిధ్వనులను వినగానే, అది తక్షణమే తన ప్రయాణ మార్గాన్ని మార్చి వేస్తుంది.*

*గబ్బిలాలు ఒక చీకటి గదిలో కూడా ఎగరగలవు. ఇవి గోడలను కొట్టుకోకుండా వాటిపై నిలువగలవు. గబ్బిలాలు అత్యంత అభివృద్ధి చెందిన "రాడార్ సిస్టం" అని పిలువబడే ప్రతిధ్వని ఉపకరణాలను ఉపయోగిస్తాయి. వీటిని చూసే, మానవుడు తన రాడార్ విధానాన్ని కనిపెట్టగలిగాడు!*

## నిట్టూర్పు - నీతివాక్యం

*ఒక పురుషుడు ధర్మోపన్యాసం (నీతివాక్యం)లో చెప్పేదాని కంటే ఒక స్త్రీ తన నిట్టూర్పు ద్వారా ఎక్కువ చెబుతుంది.*

"వేకువ ఇంకా చీకటిగా ఉన్నా పాటలు పాడే పక్షి - విశ్వాసం."

— రవీంద్రనాథ్ టాగోర్

# అవీ-ఇవీ

## ఎలక్ట్రోమాగ్నటిక్ శక్తితో నడిచే నౌక

ప్రపంచంలో మొట్టమొదటి ఎలక్ట్రోమాగ్నటిక్ శక్తిగల నౌక - "యమాటో ఒన్" - అని పిలువబడుతున్నది - జపాన్‌లోని కోబెలో ఉన్న మిట్సుబిషీ హెవీ ఇండస్ట్రీస్ షిప్‌యార్డ్‌లో నిర్మించబడింది. ఒక క్రొస్టాట్ మరియు ఆరు శ్రేష్ఠంగా నిర్వహించే విద్యుత్ వలయాల ద్వారా ఎలక్ట్రోమాగ్నెటిక్ శక్తిని ఉత్పత్తి చేసి తద్వారా ఈ నౌకను చలనంలో పెట్టారు. పదిమందిని తీసుకువెళ్ళేందుకు, గరిష్టం వేగం ఎనిమిది సముద్రపు మైళ్ళు చేరేందుకు వీలుగా దీన్ని రూపొందించారు.

## ప్రీ - ఫాబ్ టెక్నాలజీలో ప్రావీణ్యం పొందిన మొదటి దేశం

ముందుగా రూపొందించిన టెక్నాలజీలో ప్రావీణ్యం సంపాదించిన మొదటి దేశం - రష్యా ముందుగా తయారుచేసిన గృహాల నిర్మాణ రంగంలో కూడా ప్రపంచంలో ముందంజ వేసిన దేశం ఇది. ఈ పద్ధతిని ఉపయోగించి ప్రపంచంలో గృహాల నిర్మాణం జరిపిన దేశాలన్నిటికంటే 50 శాతం రష్యా ఎక్కువ గృహాలు నిర్మించింది. ఈ ప్రీ - ఫాబ్ టెక్నాలజీ వల్ల వ్యయం తగ్గుతుంది. పనిలో నాణ్యత పెరుగుతుంది. నిర్మాణ వేగం రెండురెట్లు హెచ్చుతుంది.

## పిల్లలతో మాట్లాడే పుస్తకాలు

కొత్తరకం పుస్తకాలు - తమ చిన్నారి పాఠకులతో మాట్లాడేవి - ఇప్పుడు యునైటెడ్ స్టేట్స్‌లో లభిస్తున్నాయి. ఈ పుస్తకాల పేజీలు మామూలు పద్ధతిలోనే పూర్తి పాఠాన్ని లేదా చిత్రపటాలను (బొమ్మలను) ప్రచురిస్తాయి. దీనికి తోడు ఒక రికార్డు గాడిగల ప్లాస్టిక్ ముద్రణను కలిగి ఉంటుంది. పాఠకుడు ఒక సూక్ష్మరూపమైన గ్రామఫోన్ - ఒక చిన్న పికప్ మరియు టర్న్‌టేబిల్ ఉపయోగిస్తాడు. దీన్ని పేజీలపైన ముద్రించబడిన ప్లాస్టిక్ గాడులపైన ప్రయోగించగానే శబ్దం ఉత్పత్తి అవుతుంది.

## కృత్రిమ ఆహారపు రంగులు

ఆస్ట్రేలియాలో అంగీకరించబడిన కృత్రిమ ఆహారపు రంగులు 17 కాగా రష్యా 3 రంగులకే అనుమతి ఇచ్చింది. ఎటువంటి కృత్రిమ ఆహారపు రంగులు వాడరాదని ఉత్తర్వు చేసిన ఏకైక దేశం - గ్రీస్. భారత ప్రభుత్వం 8 రంగులకు ఆమోదం తెల్పింది.

## ప్రపంచంలో పెద్దదైన తరంగ రేడియో టెలిస్కోప్

భూమి నుండి 15,000 కాంతి సంవత్సరాల దూరంలో ఉన్న గాసియస్ నెబ్యులా ఉష్ణోగ్రత ఉక్రెయిన్‌లోని ఖార్కోవ్ సమీపంలో గల ప్రపంచంలోని అతి పెద్ద లాంగ్ వేవ్ రేడియో టెలిస్కోప్ ద్వారా కనుగొన్నారు. సౌర మండలం కన్నా ఎన్నో రెట్లు ఎక్కువ చోటును ఆక్రమించింది - నెబ్యులా (వాయువు, ధూళి కలిసిన గొప్పరాశి).

## యుఎస్ఏ శబ్ద సృష్టికర్త

*యు.ఎస్.ఏ (యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా) అనే శబ్దాన్ని (పరిభాషను) సృష్టించిన వ్యక్తి థామస్ పైనీ (1737-1809) అనే అమెరికా రచయిత.*

"మనసులోని శాంతికి ప్రతిబింబమే కళ్ళలోని కాంతి." — రోజ్‌పాల్